# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 1 | రాజమహేంద్రవరము 16-10-1978 | సంచిక 24

## —* ఈ సంచికలో *—



1—11—78 సంచికలో సాహిత్యలక్ష్యం, శరత్ జీవితం—సాహిత్యం, రామకృష్ణుని కవిత—వాస్తవికత, అన్యదేశ్యములు, స్వాతంత్ర్యానంతరం తెలుగు నవలా వికాసం మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10—00.
అర్థసంవత్సరమునకు రు 5—50.

విడిప్రతి 50 పై.

# ప్రబోధము

— శ్రీ జమదగ్నిశర్మ, ఎం. ఏ.

( నా 'గిరి ప్రదక్షిణ మహాకావ్యము' లోని తృతీయపదంలో మూకోపాఖ్యాని కంఠంలో ఆవిష్కృతమైన కొన్ని పద్యములు. )

జ్ఞానముతో సమానముగ సంస్కృతి మాపు పవిత్రమెద్దియున్
గానము నిర్విశేషమును జ్ఞప్తి యొకండె యగున్ స్వరూపమే
దైనది గాన దాని బడి యన్నియుఁ దోఁచును వేదశాస్త్ర వి
జ్ఞానము దానినిన్ దెలుపఁజాలదు తత్త్వము తెల్ప నంతియే॥

సాధనచేసిచేసి యఘుసంక్షయమైన విశుద్ధ బుద్ధి యం
దేధవుఁడైన సాధకు నహీన కృపన్ దరియింపఁజేయగా
సాధితుఁడౌచు నిల్చి వివశత్వము నందఁగఁజేసి యెప్పుడో
బోధముమాత్రమైన నదెపూర్ణతయున్ బరమార్థమయ్యెడున్॥

జ్ఞానము మేధమంచుఁ దనసాక్షితఁ గప్పి ప్రపంచ భోగమున్
మానక పెంచుచున్ వినుత మానవు దానవుఁ జేయుచుండు న
జ్ఞానమె జ్ఞానమం చిపుడు జల్పమొనర్చెడి వారు పెక్కురై
జ్ఞానమెఱుంగ రాక నరజాతి యధఃపతనంబు నందెడిన్॥

మనుజుండై జనియించు టెప్పుడును బ్రహ్మజ్ఞానముం బొందనై
తనువున్ దానికిఁగాక భోగమునకే దౌర్భాగ్యమై పూన్చువాఁ
డనఁ గర్పూరమునిచ్చియుప్పుగొను మూర్ఖాగ్రేసరుండౌను ము
క్తిని బొందన్ దనువెత్తివెత్తియయి రక్తిన్ మున్గుటల్ ధర్మమే!

అయయో ధర్మమెఱుంగ రీజనులు వ్యర్థాయాసులై నిత్య మ
వ్యయభోగంబులకై వ్యయించెదరు దేహప్రాణ దివ్యాయుష
ప్రియధీశక్తులఁ బొందఁగల్గునది నిర్ణీతంబె యై యుండ దు
ర్ణయమేలా నిజధర్మ మూనునెడ దానన్ సర్వమున్ గల్గెడిన్॥

ధర్మము నందు నిల్చునెడఁ దప్పక రాదగు నర్థమబ్బు నీ
మర్మమెఱింగి లబ్ధమగు మానితసంపద దేహధారణం
బర్మిలిఁ జేయ నెంతతగు నంతయు హాయిగ వాడికొంచు స
త్కర్మము లందె జీవితము తప్పక నిల్పిన మోక్ష మబ్బెడిన్॥

'ధర్మాదర్థశ్చ' యనెను
మర్మజ్ఞుఁడు వ్యాసమౌని మనుజత కలిగెన్
ధర్మ మెఱుంగుచు నిలిచిన
కర్మము లన్నియును ధర్మ కర్మములయినన్॥

రాదగు నర్థముల్ కలుగుఁ బ్రాప్తముతోఁ బరితృప్తినంది నీ
వేది గడింపఁ బుట్టితివొ యెప్పుడు దానిని విస్మరింప కో
వేదమయా! దయాంబునిధి! వేగమునన్ దరియింపజేయు మం
చాదట ధర్మమూనుటకె యంగము నిల్చుట మానవత్వ మా॥

మానవదేహమందె పరమార్థము నందవలెన్, లభింప దీ
మానవ దేహ మూరకయె, మాధవుఁ డిచ్చిన మానితాంగమున్
మానక ముక్తికై నిలుపు మానవుఁడే పరమార్థవేత్త యా
కానక వ్యర్థభోగములకై వ్యయపెట్టెడు వాఁడు మూర్ఖుఁడౌ॥

భారతదేశ మీమహిత భావము తెల్పుచు లక్ష్యసిద్ధికే
దారియొ దానిఁజూపి మను ధన్యుల నుద్భవ మందఁజేయగా
భారత మాచు నీశ్వరు కృపన్ మహియందున నిల్చు నేటికిన్
భారతులైన మానవులె భవ్యులు వెల్గున నుండుఁ డందఱున్॥

దైవము వెల్గునం దునుప దానిని కాదని గబ్బిలంబులై
భా వివరం బొకింతయును బట్టని యజ్ఞుల యంధకార మం
దావలితాత్ములై తిరుగు టచ్చెరు వయ్యెడు ధీవివేకమే
త్రోవను బోవుచున్నదియొ తూలక నిల్చి తలంపగా నగున్॥

ఊరక మోహమందు టయయో యొక తెల్వియె వేదధర్మ మీ
దారి నెఱుంగఁ జేసినది దానిని పూనిన భారతంబు ము
న్నేరికి నైన పూజ్యమయి యెంతయొ భాగ్యమునంది వెల్గెనేఁ
డూరక ధర్మమున్ విడిచి యుర్వి దరిద్రత తానె తాల్చెడిన్॥

అభ్యుదయంబు నందుటకు నైన వివేకము నూనకుండె దే
శాభ్యుదయార్థులేము యని యన్యులధర్మమునందు మోహితుల్
సభ్యతవీడి ప్రాజ్ఞజన సంఘ మతంబు నొకింత యెంచకే
మభ్యముపెట్టు చజ్ఞజన మాన్యత నంది యడంతు రయ్యయో!

ఏదిత్యజించు హేతువున నీ పతనంబును బొంది యుంటివో
యాదిని దాని నూనునెడ నభ్యుదయంబది కల్గుగాని యే
దేదియొ గొప్పదంచు మతిహీనత నూన వివేకమౌనె నీ
వాదిజుడైన బ్రహ్మయుదయంబున కాస్పద మైనవాఁడవు!

భారత! భారతా! మహిత
భాస్కర! నీవు నిజంబుగా మహో
దార పరాత్పరుం డవుదు
దాని నెఱుంగక మోహితుండవై
భీరుత నన్యదేశనయ
భిక్షుకుఁడైతివి నేటికైన ప్రా
గ్ధిరత నూని స్వీయనయ
దివ్యమహత్త్వముఁ జూపి వెల్గుమీ!

# సంసారవృక్షంలో స్త్రీపాత్రలు

— కృష్ణప్రియ.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతి పొందిన శ్రీ. ఆర్. ఎస్. సుదర్శనంగారి నవల "సంసారవృక్షము" నేటి నవలా సముద్రంలో ఉద్భవించిన ఆణిముత్యం. ఈ నవలలోని నవలామణుల పాత్ర స్వభావాదులను గూర్చి చేసిన పరిశీలన తెలుగు భాషామతల్లి పాదపూజా సుమంగా అర్పిస్తున్నాను.

"సంసారవృక్షం" నవలలోని నాయిక సావిత్రి. సంసార తరువుకు మూలశక్తి లాంటిది. నాయకుని స్వప్నంలో అశ్వత్థ వృక్షంగా కనబడి, అప్సరసగా మారి, అదృశ్యమైన ప్రేయసి హేమసుందరి ద్వితీయపాత్ర. ప్రేమవివాహం విచ్ఛిన్నమై, సంతాన ఫలంమీద వాత్సల్యానురాగాలు గల రత్నమూర్తి అమృత ముచ్చటైన మూడవపాత్ర.

నిర్లిప్తుడు, బద్ధకస్థుడు, పిరికివాడు, హేతువాది, అయిన లాయరు ఈ నవలలోని నాయకుడు. ఈతడే ఉత్తమ పురుషలో కథ చెపుతాడు. ముగ్గురు మగువలు ఈతని చుట్టూ పరిభ్రమిస్తారు. కథకు జీవంపోస్తారు.

నిర్మల హృదయినిగ - ప్రేమమయిగా - స్నేహరూపిణిగ - ఉత్తమ ఇల్లాలుగ - అనసూయగ (అనూయలేనిది) - పతియంద పరిమిత బద్ధానురాగమూర్తిగ సాక్షాత్కరిస్తుంది సావిత్రి.

"గజ్జికుక్కను చంపిన పిస్తోలు చప్పుడు విని ప్రవేశించిన సావిత్రి "డాక్టరు మంచివాడు, దానికి మోక్షం కలిగించాడు" అని కామెంటు చేస్తుంది సహజమైనసరళత్వంతో. రాజా(కుక్క) అల్లరివిషయంలో భర్తను తొందర పెట్టి 'పిడి' గొట్టిస్తుంది సావిత్రి. అది దిగులుతో అన్నం ముట్టకపోతే భర్త దాని కాహారం పెట్టమని ఒత్తిడిచేస్తాడు. "పిల్లలులేని గొడ్రాలును నేను-మాతనా! మాతృహృదయం వగైరాకలదాన్ని ఎట్లా అవుతాను" అంటుంది. కళ్ళల్లో రోషం దుఃఖం ముంచుకవచ్చి నిష్ఠూర మాడుతుంది. అప్పటి ఆమె స్త్రీ హృదయం-తల్లిని కాలే దన్న ఆవేదన-అభిమానం కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి.

సావిత్రి మనస్తత్వం కూడ విచిత్రమైనదే. అంతకుముందే గజ్జికుక్కను కాల్చిచంపిన డాక్టరును మెచ్చుకుంటుంది. మళ్ళీ "అయ్యో! పాపం నిండు ప్రాణం ఎలా పుటుక్కన తీశాడని ఆశ్చర్యపోతుంది.

హేమసుందరి లాయరు స్నేహితుడైన భావనారాయణ చెల్లెలు. నాయకుని కలలో "మీశాపంవల్ల చెట్టునయ్యాను" అంటుంది. అచ్చరగా మారి అదృశ్యమాతుంది.

జీవితంలో అనుబంధాలు విచిత్రంగా ఏర్పడుతాయి. దానికి సమయం - సందర్భం-వయసు- సొగసు- న్యాయం - ధర్మం వీనితో పనిలేదు. వివాహమై ఏడెనిమిదేళ్ళయినా పిల్లలు కలగని సావిత్రి కంటె నవనవలాడుతు విద్య యిచ్చిన విజ్ఞాన తేజస్సుతో అందంకంటె అద్దం లాంటి నిర్మలమైన మనస్సుకల బి. ఏ. బియిడి. పాసైన హేమ పుస్తకాలకోసం-విజ్ఞానంకోసం-కాలక్షేపంకోసం వచ్చేది. ఆ పరిచయం స్నేహంగా మారి ఆకర్షణ కలిగించి ప్రణయానికి దారితీసింది. ప్రేమలేఖలు వ్రాయించినది. ఆమె అందం కంటె అద్దంలాంటి ఆమె మనస్సే అతన్నాకర్షించింది. వీరి సాన్నిహిత్యం-ప్రేమలేఖలు- ప్రణయం ఏవీ అమాయికురాలైన సావిత్రికి తెలియవు అనే దానికంటె సావిత్రి అనుమానం-అసూయలేని ఉత్తమ ఇల్లాలుగ గోచరిస్తుంది. అందుకే వాళ్ళిద్దరూ స్వేచ్ఛగామాట్లాడుకోడానికి అవకాశం కల్గించింది.

అసత్యం ఆధారంగా హేమతో ప్రేమానుబంధాన్ని చట్టసమ్మతం చేసుకోవడానికి నాయకు డిష్టపడలేదు. "నేను చనవుతీసుకున్నాను. నీవు చనవిచ్చావు. కాని యిక్కడి నుండి ముందు దారి కన్పించడంలేదు. నన్ను క్షమించు" అని ఫుల్‌స్టాప్ పెట్టేస్తాడు. హేమ మాటామంతీ లేకుండా గంభీరంగా చివాలున లేచి వెళ్ళిపోయింది. మళ్ళీ కలుసుకోలేదామె అతడిని. అంత ఉదాత్తహృదయ కాబట్టే సావిత్రితో "నన్ను క్షమించు. మీ వారితో స్నేహం పెంచుకోవడం-దాని పరిణామం తెలీక చేసిన పొరపాటు. అందుకే ఆ పొరపాటు మళ్ళీ చెయ్యను. నాతో ఎప్పటిలాగే వుంటావు కదూ." అని ప్రాధేయపడిన ప్రాజ్ఞురాలు.

సావిత్రి తనకు పిల్లలు కలగలేదని హేమను ద్వితీయం చేసుకోమన్న సుగుణశీల. వివాహంపై డాక్టరు సిద్ధాంతం భర్త

"ముఖతః విని నవ్వుతూ" సమానత్వమూ-చట్టుబండలూ- అలా జరగడం ఆడవాళ్ళు సహించలేరు. అంతకంటె మగవాళ్ళూ సహించలేరని తేలికగా, ఖచ్చితంగా తేల్చి పారేసిన ఇల్లాలు.

భావనారాయణ తన చెల్లెలు హేమ వివాహం డాక్టరుతో జరగడానికి పెద్దరికం వహించడానికి కూడ వెనుకాడలేదు సావిత్రి. భర్త మధ్యవర్తిగా వెళ్ళడాన్ని సావిత్రి ప్రోత్సహిస్తుంది. ఈలోగా 'ఈస్నఫీలియా' వల్ల డాక్టరుచేత ఇంజక్షన్లు చేయించుకోవాల్సి వస్తుంది. మొదటిసారి క్రొత్త-భయం-సిగ్గు చూపిస్తుంది సావిత్రి. రెండవసారి దర్జాగా వెంకటగిరి జరీచీరతో హుందాగా వెళుతుంది ప్రక్కింటికి. మూడవసారి ఆడంబరంగా అలంకరించుకోవడం-నడకలో క్రొత్తదనం ధీమా-తెచ్చుకుంటుంది. డాక్టరు తల్లితో కలివిడిగా మాట్లాడుతుంది. నిర్వేదం పోయి చైతన్య స్రవంతిలా కనిపిస్తుంది భర్తకు.

భర్త ఊహాలు-వాదాలు-సిద్ధాంతాలు అన్నీ జరుగుబాటుకు లోటులేదు గనక, సాగుతోంది కాబట్టి సరిపోతుంది-లేకపోతే సిద్ధాంతాలు పట్టుకుర్చుంటే పనులు జరగవని తేలిగ్గా కొట్టిపారేస్తుంది సావిత్రి. హేమ వివాహం డాక్టరుతో నిర్ణయమైన రెండురోజులకు ఏదో పనిమీద లాయరు హైదరాబాదు వెళతాడు. అతడు తిరిగి వచ్చేటప్పటికి జరగిన విశేషాలూ-పరిస్థితులూ జీవితాన్ని ఒక చిత్రమైన మలుపుకు త్రిప్పాయి.

ఆరోజు మధ్యాహ్నం పడకటింటిలో సామానుచూసి భయపడుతుంది సావిత్రి. పక్కింటి పిల్లవాడు విశ్వం ద్వారా కబురు విన్న డాక్టరు సరాసరి రివాల్వరుతో రావటం-వెంటనే పామును కాల్చడం జరుగుతోంది. ఈ డాక్టరు ధైర్యం సావిత్రిలోని అంతర్యాన్ని తట్టి లేపడమేగాక, మాతృహృదయాన్ని, స్నేహభావనను మేల్కొలుపుతాయి. నాగరాజును కాల్చి చంపార్న సెంటిమెంటునుండి, భయంనుండి భర్త ఎంత ఉత్సాహపరచినా మనస్తిమితం పొందలేక పోతుంది! ఆ ఆందోళన, పిరికితనం-పిచ్చివూహాలు డాక్టరు మాటలటానిక్‌తో తొలగిపోయి కోలుకొని చైతన్యమూర్తిగా మారి ఉల్లాసంగా వుంటుంది. వావి వరుసలు లేకుండా పేర్లతో పిలుచుకొనే వారి పరిచయం లాయర్‌కు కంటగింపుగా ఉంటుంది. తల్లిపోయిన డాక్టరును పసివానిలా భావిస్తున్న సావిత్రి భర్తకళ్ళకు స్త్రీత్వంతో నిండిన సామాన్యగానే గోచరిస్తుంది. తల్లి కర్మ చేయని అకర్మణ్యుడని, మాతృగౌరవం లేనివాడని డాక్టరును ఈసడించుకొంటాడు. అటువంటి వాడిలో "తనకు లేని తమ్ముడ్ని, పుట్టనికొడుకును చూసిన సావిత్రి మనసులోతుల గ్రహించడీ తార్కికవాది- వేదాంత ప్రియుడైన భర్త. పైగా ఆమె ననుమానించి శంకిస్తాడు.

పెద్దన్నగారు దత్తత చేసుకోమని తమ్ముణ్ణి బలవంతం చేస్తాడు. సంతానాపేక్షతో తహతహలాడుతున్న సావిత్రి తలపుకువచ్చి తనలోపమో - సావిత్రి లోపమో తెల్సుకోడానికి డాక్టరు వీరభద్రరావుచేత పరీక్ష చేయించుకొంటాడు. అతని పరిశోధనవల్ల తను తండ్రి కాజాలడని తెలుసుకుంటాడు. ఈ సంగతి భార్యతో చెప్పలేక మథన పడుతుండగానే నెలరోజులు గడిచిపోతాయి.

పిక్చర్ చూసి ఇంటికి వచ్చిన ఆరాత్రి పాలనురుగులాంటి తెల్లని-చీరలో వెన్నెలలో సావిత్రితో పొందిన అనుభూతి అనిర్వచనీయమైనది, అనుభవంలోనే తాను పొందుతున్న అనుభూతిని అంచనా వేసుకుంటాడు పారవశ్యంతో.

హేమ పెండ్లి జరిగిపోయింది. హేమ వెళ్తున్నానని చెప్పడానికి రాలేదు. అంతవరకు, హేమ పెండ్లిని గూర్చి నిర్లిప్తంగా ఆలోచించిన లాయర్ కనబడకుండా హేమను తలచుకొని "అందుబాటులో లేని ప్రేయసిని గూర్చి ఆరాధన రొమాంటిక్ ప్రేమ-అదొక అనిర్వచనీయమైన ఆవేదన. వానికి తార్కికమైన పరిష్కారం లేదు" అని తనని తాను సమర్థించుకొంటూ హేమసుందరి పాత్ర నిష్క్రమణను గూర్చి చెబుతాడు.

స్త్రీ హృదయపు లోతులు మరో స్త్రీ మాత్రమే తెలుసుకోవడమేకాదు, పురుషుని మనసు అట్టడుగు పొరల్ని కూడ అవలీలగా తెలుసుకోగలదు. హేమకోసం భర్త నిర్వేదాన్ని- పరధ్యానాన్ని -నిరీక్షణనూ దిగులునీ పసిగట్టినా అనుమానించని సంస్కారవంతురాలు-ఉత్తమురాలు సావిత్రి.

ఈ సమయంలోనే సావిత్రి తల్లికాబోతూందన్న వార్త షాక్‌లా తగిలింది. పురుషాహంకారముతో భార్య శీలాన్నే శంకిస్తాడు.అంతవరకు వేదాంతం- మతం-హేతువాదం- అనుభూతి అద్వైతం అంటూ సంస్కారిగ మాట్లాడిన వన్నీ అసూయ, అనుమానం అనే మంటలోపడి మసైపోతాయి. డాక్టరుని ఆకర్షించి మాతృత్వం పొందిందన్న నమ్మకం అతనిలో బలంగా వ్రేళ్ళు తన్నింది. ఈసంఘర్షణ భరించలేక ఆగలేక పిరికిగా లోకంలోకి పారిపోతాడు. తనను అనుమానించి వెళ్ళిపోయాడని ఏమాత్రం తెలియని అమాయిక సావిత్రి.

ఇక్కడినుండి కథ విచిత్రమైన మలుపు తిరిగి, మరో స్త్రీ నాయకునిజీవితంలో ప్రవేశిస్తుంది.

అమృత పంజాబీ యువతి. ఆమెకు మూడేళ్ళ కొడుకు ఆనంద్. భర్తతో పెళ్ళి గాక పూర్వం రొమాంటిక్ ప్రేమలోని మాధుర్యాన్ని తనివితీరా ఆస్వాదించింది. వివాహ మయ్యాక సెక్స్ విషయంలో ఆమెకు తీవ్రమైన అసంతృప్తి కలిగింది. సంవత్సరం లోపుగానే తల్లికావడం ఆమెకు భర్తతో అతని కుటుంబముతో సరిపడక గురూజీ ఆశ్రమానికి వచ్చేసింది.

"అమృత చాలనిర్భయంగా సూటిగా అమాయికంగా మాట్లాడుతుంది. తన విషయాలు చెప్పేటప్పుడు ఎక్కడా అతిశయం చూపదు. ఏమీదాచి పెట్టదు. భర్తను విడిచినా ఆమెకు బిడ్డమీద మమకారం"

గురూజీ ఆశ్రమంలో నియమాలు-నిబంధనలూ లేవు. అందుకే లాయర్‌తో సాన్నిహిత్యం - స్నేహం చెయ్యడంలో ఆమె స్వేచ్ఛాప్రియత్వం-నిర్మొహమాటం కనబడుతుంది మనకు. "సెక్స్ పూర్తిగా అనుభవించాను. సెక్స్ అంటే ఉన్న ఆకర్షణా, వ్యామోహమూ పోయాయి; అంటుంది ఏమాత్రం సంకోచం-సందేహం లేకుండా. "ప్రేమలేకుండా సెక్స్ ఒక్కటే చాలకాలం నిలవలేదు." అనే నిశ్చితాభిప్రాయం కల వ్యక్తి అమృత. సెక్స్‌లో ఈర్ష్యాసూయలకు తావులేదని లాయర్‌తో వాదించి అతని అజ్ఞానానికి జాలిపడి చిఱునవ్వు నవ్విన ధైర్యశీల. బ్రతుక నేర్చిన మగువ. అంతేకాదు సెక్స్ లేక వాడిపోతున్న లాయర్‌కు అవసరమైతే అనుభవం పంచియివ్వడానికి వెనుకాడని సాహసి.

ఆశ్రమంలో వారంరోజులు జబ్బుపడ్డ లాయరుకు అమృత సొంతమనిషిలా అన్నీ అమర్చి సేవలుచేసింది. ఈనిర్భీక-సాహసి అయిన యువతి తన అభిప్రాయాలు ఎవరిమీద రుద్దదు. ఆదరణ, అక్కర, చూపి; సేవ-సపర్య చేసి నిస్వార్థంగా ప్రవర్తించిన త్యాగమయి బిడ్డపైగల వాత్సల్య మమకారాలతో స్వార్థపరుడు చదువుకొన్న అహంభావి సంస్కారపు ముసుగు కప్పుకున్న నాయకునిలో స్త్రీయొక్క మాతృత్వపు విలువలను గ్రహించేలా చేసి తటిల్లతలా అకస్మాత్తుగా తన పాత్రను ముగిస్తుంది ఈ జీవన నాటకంలో.

"నవ్వుతూమాట్లాడే అమృత-ఆమెలో తొణికిసలాడే చైతన్యం - ఆమె ఆప్యాయత - బిడ్డపై అంతులేని వాత్సల్యం-ధీమా" మన మనసుల్ని ఆకట్టుకొంటాయి. అర్థాంతరంగా కాలం కాటేసిన ఆఅతివ పట్ల సానుభూతి కల్గుతుంది పాఠకులకు.

అమృత సాహచర్యం - వాదం వల్ల ఆశ్రమ జీవితం యొక్క మౌలిక తత్త్వం కొంతవరకు నాయకునికి అర్థమౌతుంది. ఈ స్వేచ్ఛావర్తనంలో మానవమనో వికారాలైన ఈర్ష్య-స్పర్ధ,పరిగ్రహము(Possessiveness) బాధము-ద్వేషము వంటివి లేకుండా పోయే అవకాశాలున్న వని సూచనప్రాయంగా గ్రహిస్తాడు లాయరు.

కలకత్తాలో అమియాబాబా దర్శనంతో అతని శిష్యుడౌతాడు. గురువు దగ్గర మంత్రదీక్ష స్వీకరించి ధ్యానం చేస్తాడు చాలరోజులు. ఆనందానుభూతిని పొంది అహంతలోకి ప్రవేశించే స్థితికిచేరుకుంటాడు. అతనికి ఒకరోజు ధ్యానంలో నిద్రవంటి స్థితిలో ఒక విచిత్ర స్వప్నం వస్తుంది. జబ్బుపడిన సావిత్రి-ఆమె చూపు భర్తచూపుతో కలసి ఏదో అశక్తత-భయం కలిగించాయి అతనిలో. ప్రక్కనే ఒక పాపాయికూడ కనిపించాడు.

బాబాగారితో స్వప్నవృత్తాంతము-తన మనోవ్యథా చెప్పుకొంటాడు. ఆయన సలహాతో ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకోవడమూ-మరల వైద్యపరీక్ష చేయించుకోవడమూ జరుగుతుంది. తన అపోహ, అనుమానం మిథ్యఅని తెలిసిపోయాయి. "గజంమిథ్య పలాయనం మిథ్య" అయి రజ్జుసర్పభ్రాంతి అని వడ్లగింజలోబియ్యపుగింజలా తేలిపోయింది.

సావిత్రికి మంచిముత్యాలు తెచ్చియిచ్చాడు. పాపాయి నవ్వుతున్నాడు. పురాణ సావిత్రి యముని సాధించి మృతుడైన పతి ప్రాణాలను తెచ్చుకొన్నది. ఈ 'సంసారవృక్షం'లోని సావిత్రి తన ప్రేమానురాగాలతో భర్త అద్వైత స్థితిలో సంకల్ప మాత్రంచేత అతని అహంతలో ప్రవేశించి తన నిర్దోషిత్వాన్ని పొంది చివరికి ఇంటికి తెచ్చుకోగల్గింది.

అందుకే సావిత్రి సంసారవృక్షంలో అతి కీలకమైన, అమూల్యమైన, సజీవమైన, మరుపురాని మరువలేని మహోజ్వల పాత్ర.

# కరపత్రాల్లో కవితాంశ

— శ్రీ ఇ. టి. లోకనాథరావు, ఎం. ఏ.

నేటి కవిత్వానికి సమకాలీన సమస్యల్ని ప్రతిబింబించడం, నిజం చెప్పాలంటే ముఖ్యమైంది; అవసరం కూడ. అందుకు భిన్నమైన సాహిత్యాన్ని ఊహా జనిత మని, అవాస్తవిక మని అనుటకూడ కద్దు. నిజం కూడ అంతే. ఏ సాహిత్యానికైనా భావాన్ని, దాన్ని ఆవిష్కరించేవిధానాన్ని, బట్టి ఆ సాహిత్యం యొక్క స్థాయి పెరుగుటో, తరుగుటో జరుగుతుంది. భాష, భావము ఉన్నంత మాత్రాన సాహిత్యం సంపద్వంతం కాదు. రెండింటి యొక్క మేలికలయికే నేటి కవిత్వంయొక్క మేలిమి గుణం.

కవిత్వం యొక్క అంశ ప్రతి అణువులోను ఉంటుంది. కాని ప్రతి వారికి కనిపించదు. కవితా చక్షువులుం కలవానికే కనిపిస్తుంది. అంత మాత్రంచేత వ్యక్తం అవుతుందనీ చెప్పలేం. వ్యక్తం చేయడానికి భాష కావాలి. దాని కొక భావ ముండాలి. అప్పుడే వెల్లడైన వార్త కొక కమనీయత ఉంటుంది. ప్రాచీన సాహిత్యం ప్రకారం పద్యాల్లోనే కవిత్వ ముంటుందని, గద్యాలు రసహీనమైనవనే వాదన ఉండేది. అది క్రమేపి మాయమై రసోద్రిక్తత కలిగించే ఏ ప్రక్రియఅయినా కవిత్వమునేధోరణి బయలుదేరింది. అదే సులువు అని మనకు అనిపించకమానదు. అందుకు కారణం హృదయాన్ని కదిలించడమే మంచి కవిత్వం యొక్క లక్షణం కదా. పద్యమైనా, గేయమైనా, పాటనైనా వెల్లడియైన భావం నుండి, తదనుగుణమైన రసోత్పత్తి కలిగితే అందరూ బాగుంది అంటారు. పదే పదే మననంచేస్తారు. మననాన్ని పొందడమే మంచి కవిత్వం లక్షణం.

సమసమాజవాద దృక్పథంలో, ముఖ్యంగా అభివృద్ధిచెందుచున్న దేశాల్లో ఆనందం కన్న ఆర్తికి కవిత్వంలో స్థానముంది. అందుకు కారణం అభివృద్ధి చెందుతూంది కాబట్టి. దోపిడీ విధానం ఉంటుంది కాబట్టి. కవి సంఘపుజీవి కాబట్టి. కొద్ది మందే పొందుతున్న సుఖం కన్న అనేక మంది కందుతున్న కష్టానికే ఎక్కువస్థానం యిస్తాడు. ఇవ్వాలి కూడ. ఫ్యూడల్-పెట్టుబడిదారీ వ్యవస్థలో స్వల్ప వేతనాలు; పని గంటలు హెచ్చు. కనీస సౌకర్యాలు లేకపోవుట, కొందరికే ఉన్నత విద్య, నిరుద్యోగం, ధరల పెరుగుదల, జాతి, కుల మతత్వాలు మున్నగు మౌలిక అంశాలు; ఉండక తప్పవు. అట్టి అంశాల నుండి, ఒక కవి యొక్క కవితా అంశాలు తప్పించుకొని బ్రతకడం అసంభవం. అనూహ్యం.

ఒక మనిషి పొందేబాధ, ఆ మనిషే వ్యక్తం చేస్తే రసోత్పత్తి బాగుంటుంది. దాన్నే ఏ స్నేహితుడో, క్రాంత దర్శి, పరేంగితజ్ఞుడు అయినా ఏకవో వ్యక్తం చేస్తే అంతటి రసోత్పత్తి కలగదని చెప్పడం సత్యదూరం కాదు. అందులోకి మూకుమ్మడిసమస్యలన్ని వ్యక్తంచేయడం మరీ కష్టం. అట్టి మూకకు సంబంధించిన లేదా ఆమూకకు ప్రాతినిధ్యం వహించిన వాడు (రు) వ్యక్తీకరిస్తే రసపట్టు రమ్యంగా ఉంటుంది. ప్రస్తుత కాలంలో వివిధ సమస్యల్ని, అన్యాయాల్ని, ఆక్రందనల్ని బట్టబయలు చెయ్యడములో కరపత్రాలు ప్రముఖ స్థానం వహిస్తున్నాయని చెప్పక తప్పదు. గేయంలోనో, కథలోనే తిడితే లొంగని బడాబాబు కరపత్రానికి బెంబేలెత్తే సందర్భాలెన్నో ఉన్నాయి. పేరుమోసిన కవులు, సాహితీవేత్తలు అందించలేని సమకాలీన సమస్యల్ని అందిస్తున్నాయంటే అందుకు కారణం ఒకటే. కరపత్రంలోని అంశాలు జీవితసంబంధులు, మనస్సంబంధులు కనుక; అంతటి భావోద్రిక్తత, పఠితను కదిలించే రమ్యత, కలిగి ఉంటున్నాయి.

కవిత్వానికి చెప్పిన లక్షణాలు కరపత్రాలకు లేకపోవచ్చు. కాని ఆధునికులు వచన గేయానికి, కథకు చెప్పిన పోపు సామాను వీటిలో ఉంది. నేటి సాహిత్యానికి చుట్టూ ఉన్న వాతావరణాన్ని, అందించే గుణం ప్రధానమైనదని అంగీకరిస్తే, దాన్ని మరింత లోతుగా చూపడమే కరపత్రాలు చేస్తున్న పని. నేటి కవిత్వంచూపించే ఛమక్కులు, చిట్కాలు వీటిలో లేకపోయినా భావాన్ని సూటిగా చెప్పడం అనే సామాన్య లక్షణం ఉంటుంది. భాషవిషయానికొస్తే రెండింటికీ అందరూ మాటాడేభాషే మూలం. సమ సమాజ ప్రభుత్వాలు నెలకొల్పుకున్న దేశాల్లో కర పత్రాన్ని చిత్తు కాగితాల్లా చూడరు. సాహిత్యంలో ఒక పాలుగా చూస్తారు. అందుకు కారణం వారిసాహిత్యానికి ఉన్నది, జరుగుతున్నది యథాతథంగా, అందరికి అర్థమయ్యేటట్లు అందించడమే లక్ష్యం కాబట్టి. దీన్నే సోషలిస్టు రియలిజమ్ అని సాహితీ పరిభాషలో అంటారు. అన్నిట్లో సమసమాజవాదుల్ని అనుకరించి, అనుసరించే మనము ఈ విషయాన్ని కూడ గ్రహించాలి. మనకు ఇష్టమైనదే అంగీకరించడం, కష్టమైనది విసిరేయడం ప్రగతి కావలసిన వారి గుణం కాదు. కరపత్రాల్లో మేధావులు ఆశించే కవిత్వం లేకపోవచ్చు, కాని సామాన్యులు అనుభవించే సమకాలీన కష్టాలు ఉంటాయి. "ప్రజాసమస్యల్ని చిత్రీకరించాలంటే ప్రజల్లోకివెళ్ళాలంటే మనకు భయం, చేతకాని తనం అన్నిటి కన్నా అంతస్థు, అహం అడ్డువస్తుంది నిజాన్ని తెలుసుకోవాలంటే అబద్ధంతో

పోరాడాలి కాని "నిజం" ఫలానాలా ఉంటుందని ఊహించడం అన్యాయం. తెలిసింది, అందరికీ తెలిసేటట్లు రాయడమే నేటి రచయితల లక్ష్యం. అందులో కొందరు ఊహించే లేదా శోధించే సూత్రాలు ఉండకపోవచ్చు. అంత మాత్రాన అట్టివి ప్రజ నుండి దూరం కావు. కాలం నుండి తొలగి పోవు. సినిమా పాటలపై రీసెర్చి చేస్తున్న ఈ రోజుల్లో కరపత్రాల్లో దాగున్న కవితాంశను వెదకడం తప్పేమీ కాదు. ముఖ్యం మరియు అవసరం కూడ. ఎక్కడైతే మానసిక, శారీరక బాధ, దోపిడీ, ఆవేదన ఉంటుందో అక్కడ ఏదో ఒక రకమైన రమ్యత ఉంటుంది. రమ్యత ఉంటేనే కవిత్వ మౌతుంది. భాష చెప్పుకోదగ్గ అడ్డంకి అనుకోవడం పొరపాటు. భాషే ప్రధాన మనుకుంటే, జానపద గేయాలు, ఎంకిపాటలు, ఆటవిక గేయాలు, నిష్ఫల మౌతాయి. మనజాతి నిరంకుశమౌతుంది. ఫలితంగా, ఆదిమవాసులమై అందరం కొట్టుకొని సమసిపోయే రోజు వస్తుంది. కాబట్టి కవిత్వమైనా, మరేదైనా కాని వ్వండి, సమకాలీన సిద్ధాంత సూత్రాలకు అనుగుణంగా ఉంటే దాన్ని స్వీకరించి, అందులో ఉన్న మేలిమిని వెలికితీయ్యడమే మంచిపని. మన పని.

నేడు రాస్తున్న కరపత్రాల్ని నాలుగు రకాలుగా విభజించవచ్చు. (1). వేతనాలు-పని వేళలు గూర్చి (2) పోలీసు-రెవిన్యూ దౌర్జన్యాలగూర్చి (3) భూస్వాముల అన్యాయాలగూర్చి (4) ప్రభుత్వ ప్రజావ్యతిరేక చట్టాలగూర్చి. కరపత్రాలన్నింటిలో ఒక సామాన్య లక్షణమేమంటే కార్మికుల లేదా కర్షకుల సమస్యల్ని ప్రతిఫలింప జేయటమే నూటికి తొంభైపాళ్ళు ఉంటుంది. మేధావుల లేదా విద్యార్థుల సమస్యలగూర్చి మిగతా పదిశాతం ఉంటుందని సాధారణంగా నేడు వచ్చే కరపత్రాల్నిబట్టి చెప్పవచ్చు. కరపత్రాల్లో రాసే భాష అందరికీ పరిచయమైనది, సన్నిహితమైనదిగా ఉంటుంది. భావం ఎక్కువపాలు ఉద్రిక్తమై కరుణాపూరితమైన లేదా ఉద్రేకపూరితమైన రసోత్పత్తిని స్ఫురింపజేస్తుంది.

కరపత్రాల్లో మరొక ముఖ్యాంశమేమంటే 'శీర్షిక' ద్వారా చదవబోయే సారాంశాన్ని పఠితకు అవగతంచేయడం. అలాగే 'ఉపశీర్షికల'ద్వారా విషయాన్ని విభజనచేసి, చదివేవాడి మేధకొక అవగాహన, ఆలోచన కలిగించడం ప్రత్యేకంగా ఉంటాయి'. సర్వసాధారణంగా కరపత్రాలన్నీ ప్రబోధాత్మకమై, జాగృతి కలిగించే కోడికూతలై ఉండటమే కాకుండా, కర్తవ్యాన్ని కూడ బోధిస్తాయి. కరపత్రాల్లో ప్రముఖస్థానం తేదీలకు, సంఖ్యలకు, వ్యక్తుల పేర్లకు, సంఘటనలకు, ఉంటుంది. ఫలానా తేదీనాడు, ఫలానావ్యక్తికి, ఫలానా సంఘటన, ఫలానా అన్యాయం వల్ల జరిగింది అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పడం జరుగుతుంది. కరపత్రాల్లో సామాన్యులకు అందుబాటులో లేని కొన్ని సాంకేతిక పదాలు, సైద్ధాంతిక భావచిత్రాలు వాడుతుంటారు. ఉదాహరణకు 'అర్థఫ్యూడల్' 'వలసతత్వం' 'విస్తరణ వాదం' 'పెత్తందార్లు' 'కమ్మక్కు' 'దళారీవర్గం' 'ఫాసిష్టు ధోరణి' 'సామ్రాజ్య వాదం' 'సోషల్ సామ్రాజ్యవాదం' 'రివిజనిష్టులు' వంటివి ఎక్కువగా ఉంటుంటాయి.

కొన్ని కరపత్రాలు కథానికా రూపంలో, జరిగిన అన్యాయాన్ని కళ్లకు కట్టేటట్లు దశలవారీగా నిరూపించడం జరుగుతుంది. కొన్నింటిలో కేవలం ఉత్పత్తి లేదా వేతనాలు లేదా దోపిడీ సంబంధమైన సంఖ్యా వివరణలతో సామాన్య పఠితకు విసుగు కలిగించినా, మేధావులకు కనువిప్పు కల్గించే సందర్భాలెన్నో ఉన్నాయి. మరి కొన్నింటిలో కేవలం 'లేవండి, పోరాడండి, ఎదిరించండి'-వంటి పదజాలంతో మేధాపరమైన ఉద్రిక్తతను కల్గించడం జరుగుతుంది. ఏది ఏమైనా కరపత్రాల్లో వెల్లడించే భావాలు, మానసికమైన బాధను, మేధాపరమైన ఉన్నతత్వాన్ని, ప్రకటించేవిగా ఉన్నాయనడంలో సందేహం లేదు.

విశాఖ జిల్లాకు సంబంధించిన కొన్ని కరపత్రాల్లోని, కవితాపరమైన భావన గల వాక్యాల్ని ఉదహరిస్తాను. భారత ప్రజలను ఉద్దేశిస్తూ శ్రీ సుబ్రహ్మణ్య స్వామి M.P. ఇందిరాగాంధీకి వ్రాసిన బహిరంగలేఖలో ఇలా ఉంది.

ఎవరైనా తియ్యటి మాటలు చెపుతూ నా ఇంట్లో అడుగుపెట్టి, లోపలకు, వచ్చిన పిదప, పిస్తోలు చూపించి, నన్ను భయపెట్టి కట్టేసి, ఆడవాళ్ళను చెరచి, దొంగతనం చేసి వెళితే, దానిని ఏ మాటల్లో చెప్పాలి ?

పై వాక్యాలను కామాల వారీగా ఎంచి, గేయరూపంలో పేర్చితే ఒక చక్కటి కరుణాపూరితమైన 'వచన గేయం' ఏర్పడుతుంది. పై వాక్యాలకు పఠితను ఆలోచింపజేసే శక్తి ఉంది, కాస్త బుర్రను పెడితే జరిగే, జరుగుతున్న విషయం ఏమిటో అర్థమౌతుంది. పర్యవసానంగా సానుభూతితో కూడిన కసి, పగ ఏర్పరచే లక్షణం ఉన్న వాక్యాలవి.

తే 4-8-77న 'విశాఖజిల్లా ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థవిజ్ఞప్తి' అనే కరపత్రంలో ఇలా ఉంది.

"ఇండియాను 200 సం॥లు పాలించిన బ్రిటిషువారు తమవలస విధానాన్ని ప్రజాస్వామ్యమన్నారు. హిట్లరు తన ఫాసిష్టు విధానాన్ని, ప్రజాస్వామ్య

మన్నాడు......... ఇండియాను ముక్కలు ముక్కలుగా పాలించిన హిందూ మొగలాయి చక్రవర్తులనుండి నేటి పాలకులవరకు ప్రజాస్వామ్యాన్ని అమలు చేస్తున్నామని, ప్రజలకెన్నో హక్కులు ఇస్తున్నామని అంటూనే యున్నారు.

పై వాక్యాల్లో "వ్యంగ్యం" అనే కవితా లక్షణం దాగిఉంది. పైవాక్యాల్లో అర్థసంబంధమైన హేళన కనిపిస్తుంది. హిట్లరు, బ్రిటిషు చెప్పింది ఎలా నిజం కాదో, అలాగే నేటి పాలకులు చెప్తుతున్నదీ కాదని చెప్పడానికి చారిత్రకమైన సత్యాల్ని ఉపపత్తిగా గ్రహించి, పరితర సార్వజనీనమైన సత్యాన్ని బోధిస్తూ, తద్ద్వారా కర్తవ్యోన్ముఖుల్ని చేస్తున్నాయని చెప్పవచ్చు. కర్తవ్యాన్ని ప్రబోధించడం ఆధునిక కవిత్వంలో అభ్యుదయ కవిత్వ లక్షణంగా చెప్పవచ్చు.

పోరాటంలో కార్మికులకు పోయేదేమీ లేదు. "సంకెళ్ళుతప్ప' అనే శీర్షిక క్రింద తేదీ 30-4-77 బొబ్బిలి కళాసంఘం వేసిన కరపత్రంలో ఇలా ఉంది.

"రాజనాలు పండించే రైతు కూలీకి భోజనమే కరువైంది. రిక్షా కార్మికుని కొడుకు రిక్షా వాలాగానే తయారౌతున్నాడే కాని కనీసం ఒక బడిపంతులైనా కాలేకపోతున్నాడు. భవనాలు కట్టే కార్మికులకుసరైన ఇళ్లేలేవు."

పై వాక్యాల్లో వచన గేయ లక్షణంతో పాటు విప్లవ ధోరణిలో "సోషలిస్టు రియలిజమ్" అనే కవితా లక్షణం తొంగి చూస్తుంది. ప్రపంచం యొక్క అన్ని రంగాల్ని ఎక్కువగా ప్రభావితం చేస్తున్న సమసమాజ వాద సిద్ధాంత మౌలికసూత్రాలు సంతరించుకొన్న రచన ఇది. తేలికైన భాషతో బరువైన భావాన్ని స్ఫురింపజేయడమే నవ్యాంధ్ర కవిత్వ ముఖ్యలక్షణాల్లో ఒకటి. ఆ లక్షణం పై వాక్యాల కున్నది.

ఇలా ఉదహరించుకు పోతూఉంటే ఎన్నయినా చెప్పవచ్చు. మచ్చుకి మూడు చూపించాలి. పైని ఉదహరించిన వాక్యాల్లో మనకు కనిపించే సామాన్య లక్షణమేమంటే హృదయానికి హత్తుకు పోయేటట్లు చెప్పడం-సమసమాజ వాద సిద్ధాంత దృష్ట్యా ఆలోచిస్తే ఏ ప్రక్రియ యైనా సమకాలీన సత్యాన్ని, మూర్తిమంతం చేసేటట్లు చెపితేచాలు, అది కవిత్వమై కూచుంటుంది. కాబట్టి ప్రాచీన కవిత్వ లక్షణాల్ని, ప్రయోగాల్ని ఒక నైపు ఉంచి ఆలోచించితే ప్రస్తుత కవిత్వానికి కావలసింది రోజూ కన్పిస్తున్న, నడిపిస్తున్న అంగాలే. అలాగని బూతు, విధ్వంసం మున్నగు అంశాల్ని ప్రబోధించే సెక్సు పత్రికల్ని, డిటెక్టివు నవలల్ని ఆదరించమని అర్థంకాదు. మనిషి జీవితానికి, ముడిపడివున్న అంశాలు, కష్టాన్ని, అన్యాయాన్ని ప్రకటింపజేసే విషయాలు నేటి కవితా పరిధిలోనివే. అయితే చెప్పే ప్రక్రియలలో మార్పు ఉండవచ్చు.

ఒక ప్రత్యేకమైనపద్ధతికి, సూత్రాలకు బద్ధులమై రాస్తున్నమనం, రాసిన మన పూర్వులను చదివే మనం, ఒక్కసారిగా దృక్పథాన్ని మార్చుకోవడం కాస్త కష్టమైనా 'తప్పనిసరి' అని గుర్తించే రోజు రాకమానదు. ప్రత్యేక వ్యవస్థలో నివసిస్తున్న మనపై ఆ వ్యవస్థయొక్క ప్రభావం అన్ని రంగాల్లో, జీవిత రంగంతో సహా ఉండక తప్పదు. దాన్ని అతిక్రమించి గ్రద్దచూపు చూడగలడం అందరికీ సాధ్యంకాదు. కరపత్రాల్లో ఉన్న భాషను, భావాన్ని కవితాపరంగా స్వీకరించే స్థితికి మనం రాలేకపోవచ్చు. కాని రాగలమనే ఆశఉంది. కరపత్రాల్లో విషయం చాలా చెత్త అనుకుంటే, మనం నేడు చదువుతున్న సాహిత్యంలో చాలా చెత్త ఉందని గుర్తించాల్సి ఉంటుంది. జానపద గేయాల్లో భావం ఉందనే కదా గొప్ప వన్నారు? కాబట్టి భావం ఉన్న ఒక్క పదమైనాసరే, హృదయాన్ని స్పదింపచేస్తే కవిత్వం అని చెప్పడంలో తప్పేలేదు. హృదయమే లేని వారి మాట మన కనవసరం. హృదయమున్న వాడికే కదా కవిత్వం యొక్క పస తెలిసేది. కాబట్టి సిద్ధాంతాలు రాద్ధాంతాలు ఎలా ఉన్నా హృదయం ఉన్న వాడు స్పదించే ప్రతి భావాన్ని కవితామయంగానే పరిగణిస్తాడు. లేనివాడు కాళిదాసునైనా వ్యాసుడినైనా ఈసడిస్తాడు.

# అమృతం కురిసిన రాత్రి

— శ్రీ కె. వి. రామారావు, ఎం. ఏ.

క్రీ॥శే॥ శ్రీ దేవరకొండ బాలగంగాధర తిలక్ వ్రాసిన "అమృతం కురిసిన రాత్రి" ప్రచురించి సరిగ్గా పదిఏళ్ళు అయినది. ఈ పుస్తకం ఎందరో యువకుల్ని, యువతుల్ని ప్రభావితం చేసింది. ఈ గేయ సంపుటి దశవర్షోత్సవం జరుపుకున్న ఈ తరుణంలో ఒక పరిశీలనాత్మక పరిచయం ఈవ్యాసం.

వయస్సు సగం తీరకముందే అంతరించిన 'ప్రజాకవి' గాను, కవితాసతినొసట నిత్య రస గంగాధరతిలకంగాను 'సమకాలిక సమస్యలకు స్వచ్ఛస్ఫాటిక ఫలకం గాను శ్రీశ్రీ తిలక్‌ని అభివర్ణించాడు. ఈ పుస్తకానికి పరిచయ వాక్యాలు వ్రాస్తూ శ్రీ కుందుర్తి ఆంజనేయులు చాలాచాలా 'వాద'ములను గురించి చర్చించి అభ్యుదయ కవిపరంపరలో తిలక్‌కి ఉన్న ప్రత్యేక స్థానాన్ని నిర్ధారించారు. ఆ వాదవివాదాల్లోకి పోకుండా అసలీ పుస్తకంలో ఉన్న కొన్ని గేయాల్ని గురించి ఇక్కడ చర్చించుకుందాం.

అనేకులైన ఆధునికుల్లా కాకుండా తిలక్ సంస్కృత భాషమీద మంచి అధికారాన్ని సంపాదించాడు. ఆంగ్ల భాషలో వచ్చిన వచన కవితా ధోరణుల్ని ఆకళింపుచేసుకున్నాడు, తెలుగు వారి జీవిత విధానాన్ని, ఆలోచనాధోరణుల్ని చక్కగా గమనించాడు. తన కవితా రసవేది (alchemy) తో తన అనుభవాల్ని రంగరించి 'అమృతంకురిసినరాత్రి' సృష్టించాడు. ఈ సంపుటిలో అరువది నాలుగు ఖండికలున్నాయి. ఆణిముత్యాలనదగ్గవి వాటిలో ఎన్నో ఉన్నాయి.

భాష, భావం, శిల్పం ఇత్యాది ఎన్నో కోణాల్లోంచి ఒక కవిని పరిశీలించవచ్చు. కవియొక్క ఆశయం, కవి పరం పరలో అతని స్థానం ఇవికూడా గమనించ దగ్గ విషయాలే.

"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే
దయాపారావతాలు
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే
విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమయిన ఆడపిల్లలు"

అని 'నా కవిత్వం' అన్న ఖండికలో చెప్పుకున్నాడు కవి. రెండవ పంక్తి భావాన్ని, మూడవది భాషను సూచిస్తున్నా యంటారు శ్రీ కుందుర్తి వారు. అందమయిన సీసాలో అభ్యుదయవాద రసం అది. మరి మొదటి పంక్తి ? అది కరుణరస ప్రధానమై, మానవతావాదాన్ని సూచిస్తుంది. ఈశతాబ్ది సగటు మనిషి జీవితం, అందులోని విషాదం అద్దం పట్టినట్టు చూపే అనేక కవితలు ఇందులో ఉన్నాయి. సహృదయుని గుండెల్ని కదిలించక మానవు. జాలిపడవల్సినవి చూసి జాలిపడు, సానుభూతి చూపవల్సినచోట సానుభూతి చూపించు, ఆస్వాదించవల్సినవి ఆస్వాదించు, అనుభూతితో నీ జీవితాన్ని నిండుగా జీవించు - ఇదీ ఈ కవి సందేశం. పతితులు, భ్రష్టులు, బాధాసర్ప దష్టులు అయిన అడుగు బడుగు ప్రజలకు ధైర్యం చెప్పి శ్రీశ్రీ మార్గనిర్దేశం చేస్తే, ఈ యాంత్రికయుగపు యంత్రాల సీలలుగా, మరలుగా బిగిసిపోయి, అలవాట్ల, ఆచారాల రైలుపట్టాల మీద దొర్లుకుంటూపోయి, భయాలచాటున, ఏడుపు కొండల మాటున భయం, భయంగా బ్రతికే మధ్య తరగతి ప్రజల జీవితాన్ని మనసుకి హత్తుకునేలాగ, మనసుకి గుచ్చుకొనేలాగ చిత్రించాడు తిలక్. అయినా పురం కోటేశ్వరరావు అకాలంలో కాలధర్మం చెందడం గురించి "సి. ఐ. డి. రిపోర్టు" లో చాలా హాస్యంగా, కొంచెం వ్యంగ్యంగా చెప్పి ఈ ఖండిక ప్రాణమంతా ముగింపులో అమర్చాడు-

కాని-చనిపోయే ముందురోజూనే కనకయ్య అనే మిత్రుణ్ణి కలుసుకుని "సుఖమంటే ఏమిటి ? ఎక్కడ దొరుకుతుంది ?" అని అడిగాట్ట !
ఈసందేహం అతని జీవితానికే మచ్చ
ఇంకా పెరిగి పెద్దవకుండా అతను మరణించడం దేశానికే రక్ష"

"బల్లపరుపుగా పరుచుకున్న జీవితం మీద
నుంచి
భార్యామణి తాపీగా నడిచివచ్చి అంది
కదా—

పంచదార లేదు
పాలడబ్బా లేదు
బొగ్గుల్లేవు రాత్రికి
రగ్గుల్లేవు" - అంటూ ప్రారంభమయే "గొంగళీపురుగులు" అనే గీతం మధ్య తరగతి జీవితంలోని అనేక దృశ్యాల్ని సినిమాలోలాగ మనకళ్లముందుంచుతుంది. జీవితానికి ఒక ఆశయమ్మంటూ లేకుండా, 'రోజూ పాడే పాతపాటల్లాగ' రసహీనమైన బ్రతుకుల్ని ఈడ్చే లక్షలాది చిన్నచిన్న సంసారులను ఇందులో మనకు చూపిస్తాడుకవి. "నీడలు" కూడా వీళ్లని గురించిన పాటే. అయితే యిందులో విడివిడి వ్యక్తుల, విచిత్ర వ్యక్తుల వర్ణన గాకుండా, మధ్యతరగతి - మనస్తత్వాన్ని చక్కగా వర్ణించాడు—

"చిన్నమ్మా
వీళ్లందరూ భయపడిపోయిన మనుష్యులు
రేపటిని గురించిన భయం సంఘ భయం

అజ్ఞాతంగా తమలో దాగిన తమసుచూసి
భయం
గతంలో పారుకుపోయిన మనుష్యులు
గతించిన కాలపు నీడలు......
వీళ్లందరూ మధ్యతరగతి ప్రజలు
సంఘపు కట్టుబాట్లకి నైతిక భాష్య
కారులు
శిథిలాలయాలకు పూజారులు.

"ఆర్తగీతం" మొత్తం పుస్తకానికే మణిపూస లాంటిది. 'నాదేశాన్ని గూర్చి పాడలేను, నీ ఆదేశాన్ని మన్నించలేను, ఈ విపంచికకు శ్రుతికలుపలేను,' అంటూ విషాద భరితమైన గొంతుతో ప్రారంభమయిన గీతం ప్రతి చరణానికీ ఒకకొత్త అందాన్ని సంతరించుకుంటూ పాఠకుడి 'గుండె గూడుపట్లు ఎక్కడోకదిలిస్తుంది.' 'నేను చూశాను నిజంగా" అనే మాటలతో ప్రారంభమయిన అయిదారు చరణాలు ఎన్నో హృదయవిదారక చిత్రాల్ని మన కళ్ళముందుంచుతాయి. ఆరవ చరణం ఇది-

"నేను చూశాను నిజంగా మూర్తీభవత్
దైన్యాన్ని, హైన్యాన్ని,
క్షుభితాశ్రు కల్లోల నీరధుల్ని, గచ్ఛత్
శవాకార వికారుల్ని.
ఇది ఏ నాగరికతకు ఫలశ్రుతి ? ఏ విజ్ఞాన
ప్రకర్షకు ప్రకృతి ?
ఏ బుద్ధదేవుడి జన్మభూమికి గర్వస్మృతి ?
ఇంక నన్ను నిర్బంధించకు నేస్తం ఈ
రాత్రి నేను
పాడలేను; ఈ
కృత్రిమ వేషాన్ని అభినయింపలేను.'

"శిఖరారోహణ" మరో అద్భుతమైన గేయ ఖండిక, మరో అద్భుతమైన భావ సంచయం. ఉగాది సాధారంగా చేసుకు వ్రాసిన ఈ గేయానికి మూడు మెట్లున్నాయి మొత్తం గేయమంతా ఆరోహణ క్రమంలో ఉంది. ప్రపంచ చరిత్రలోని మహావ్యక్తులందరూ చేసిన "సత్య సౌందర్యాన్వేషణ ఒక శిఖరారోహణ" గా అభివర్ణించాడు తిలక్.

కాలానికి ఒక రూపంలేదు, దానికి పాపం
లేదు
కాలం అద్దం లాంటిది
అంధయుగమైనా స్వర్ణయుగమైనా అది
మన ప్రతిబింబం.
కాలం వలయం లాంటిది దానికి కేంద్రం
లేదు;
ఎవడికి వాడే యిచ్ఛా ప్రయత్నబలంతో
వర్ణోజ్జ్వల వలయాలను సృష్టించగలుగు
తాడు......
సాహసి కానివాడు జీవన సమరానికి
స్వర్గానికి పనికి రాడు
హిమ సుందర శృంగమైన ఎవరెస్టుని
ఒక టెన్సింగే ఎక్కగలడు..."

ఇలా ఉదహరిస్తూ పోతే కొన్ని గేయాల్ని యథాతథంగా పొందుపరచాలి. 'స్వేచ్ఛా విహారం', 'ఆరోజులు', 'వానలో నీతో,' 'యుగళగీతిక' వగైరా ఖండికలు ఎన్నో అందమయిన ప్రకృతి దృశ్యాల్ని మనకళ్ళముందుంచుతాయి. ఆరోగ్యకరమైన స్నేహంతో పెనవేసుకున్న ప్రేయసీ ప్రియుల భావలతల పూల పరిమళాలు మనలను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి.

హాస్యరస ప్రధాన గీతికల్లో 'న్యూసిలబస్,' 'కాస్మాపాలిటన్' పేర్కొనదగ్గవి- మచ్చుకి-

'అమెరికాలో డాలర్లు పండును,
ఇండియాలో సంతానం పండును
భూమి తన చుట్టూ తాను తిరుగుతూ
ధనవంతుని చుట్టూ తిరుగుతోంది
('న్యూసిలబస్')

రెండు మహాప్రపంచ యుద్ధాల్ని చూసిన కవి హృదయం సహజంగా 'యుద్ధం' గురించి, దానిలో దాగి ఉన్న భయంకర సత్యాల్ని గురించి బాగా ఆలోచించింది. తన బాధ కి అక్షరరూపం యిచ్చి మన ముందుంచాడు కవి. 'సైనికుని ఉత్తరం' 'టులాన్,' 'యుద్ధంలో రేవు పట్టణం' గుర్తొడిచే యుద్ధగీతాల్లో కొన్ని పుట్టుకలో, పెంపకంలో జీవన విధానంలో, బాటలలో, గమ్యంలో ఉత్తర దక్షిణ ధ్రువాల ఎడం ఉన్న ఇద్దరు స్నేహితుల కథ 'ద్వైతం'. విశ్వరహస్యాన్ని విడమర్చి చెప్పే స్త్రీ పురుష సాన్నిహిత్య చిత్రణ'అద్వితీయం' మిగిలిన ఖండికలలో పేర్కొనదగ్గవి 'మన సంస్కృతి', 'నవత కవిత', కాయ్ రాజా కాయ్', 'తపాలా బంట్రోతు, అమృతం కురిసిన రాత్రి', 'ప్రార్థన బెన్ జాన్సన్ గురించి విమర్శకుడు ఎల్ సి. నైట్స్ ఒక చోట అంటాడు 'His tone is that of a man who has seen many civilisations and is at home in one.' 'మన సంస్కృతి' చదివితే తిలక్ ఎడల ఈ ఉక్తి ఎంతబాగా వర్తిస్తుందో అర్థమవుతుంది. అందులో కనిపించే ఔదార్యం, గాంభీర్యం, హృదయవైశాల్యం అనన్య సామాన్యాలు.

'అయిదు ఖండాల మానవ సంస్కృతి
అఖండ వసుధైక రూపాన్ని ధరిస్తోందనీ,
భవిష్యత్ సింహద్వారం తెరుస్తోందనీ
గ్రహించలేరు పాపం వీరు,
ఆలోచించలేని మంచివాళ్లు
ఏ దేశ సంస్కృతి అయినా ఏనాడూ
కాదొక స్థిర బిందువు
నైక నదీ నదాలు అదృశ్యంగా కలిసిన
అంతస్సింధువు.'

'అమృతం కురిసిన రాత్రి' ఖండిక ఒక ఆణిముత్యం, మంచు ముత్యపు చల్లదనం, వింత అందం, ముగింపులో హృదయాన్ని స్పర్శించే కవి అనుభూతీ, పేర్కొన దగ్గవి.

శైలి దృష్ట్యా తిలక్ ఒక ప్రత్యేక స్థానాన్ని అధిష్ఠించాడు.

'వచన కవిత' ప్రక్రియకు పరిపూర్ణతను చేకూర్చినవాడితడు. అభ్యుదయ కవుల ఆవేశాన్ని సామాజిక స్పృహను భావకవుల సౌకుమార్యంతోనూ భాషతోనూ మేళవించి నూతనపథాన్ని సృష్టించాడు. 'ప్రతి మాటకీ శక్తి ఉంది, పదును ఉంది' అని గుర్తించిన తిలక్ ఆహ్లాదపరచేవి, గాయపరచేవీ ఎన్నో పదచిత్రణలు మనముందుంచాడు.

అతని కవిత్వంలోని ప్రతి చిత్రణకీ అర్థం ఉంది, ఔచిత్యం ఉంది. సందర్భాను సారంగా సంస్కృత సమాసాల్ని, ఆంగ్లపదాల్ని వాడి 'అంతరాంతర జ్యోతి స్సీమల్ని బహిర్గతం' చేశాడు తిలక్. 'కంత్వం ఒక ఆల్కెమీ' తిలక్ గొప్ప ఆల్కెమిస్టు.

# ఆధునిక సాహిత్యంలో క్షేత్రకావ్యాల వైశిష్ట్యం

— ధూర్జటి వేంకటబాలాజి, ఎం. ఏ.

ఆధునికాంధ్రసాహిత్యంలో చోటు చేసికొన్న సాహిత్య ప్రక్రియలలో 'క్షేత్రకావ్యాలకు' విలక్షణమైన స్థానముంది. ఆధునిక సాహిత్యంలో క్షేత్రకావ్యాలంటే మనకు ఇంద్రగంటి వారి 'దక్షారామము,' కొండాలివారి 'హంపీ క్షేత్రము,' పుట్టపర్తి వారి 'పెనుగొండ లక్ష్మి'కొండూరివారి 'అమరావతి' వంటివి గుర్తుకొస్తాయి.

క్షేత్రకావ్యమంటే, విశాలార్థంలో పరికించిచూస్తే ఒక ప్రముఖ చారిత్రకస్థలానికిసంబంధించినకథ గాని లేక ఒకప్రముఖ పుణ్యస్థలానికి సంబంధించిన కథ గాని తీసికొని వ్రాయబడు కావ్యమనే అర్థంచెప్పకోవచ్చు. పైని పేర్కొనబడిన కావ్యాలన్నీ యిలాంటి లక్షణాలే కలిగియుండుటవలన, అవి సాహిత్యలోకంలో క్షేత్రకావ్యాలుగా పరిగణింపబడుతున్నాయి.

ఈ విధమైన క్షేత్రకావ్యాలు కేవలం ఆధునిక సాహిత్యంలోనేనా ! లేక ప్రాచీన సాహిత్యంలో కూడా ఉన్నాయా ? అని ఆలోచిస్తే, అలాంటివి ప్రాచీన సాహిత్యంలో కూడా ఉన్నాయనే భావం స్ఫురిస్తుంది. అందులకు తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యమును ఉదాహరణాలు కాగలవు. అయితే ప్రాచీనసాహిత్యానికి సంబంధించిన యీ క్షేత్రకావ్యాలలోని కథ, రచనావిధానం, పాత్రల స్వరూపస్వభావాలు కవి భావన మొదలగు అంశాలకు నేటి క్షేత్రకావ్యాలకి సంబంధించిన అంశాలకు ఎంతయో భేదముంది.

నేటి ఆధునిక సాహిత్యం దాదాపు వీరేశలింగ గారితో ప్రారంభింపబడిన దని చెప్పవచ్చు. వీరేశలింగంగారే ఆంగ్ల సాహిత్య ప్రభావం ఆంధ్ర సాహిత్యంపై ప్రసరించుటకు మూలకారకు లనీ చెప్పవచ్చు, అందువలననే నేటి ఆధునిక తెలుగు సాహిత్యంలో, అన్ని ఆంగ్ల సాహిత్య ప్రక్రియలు చోటు చేసికొన్నాయి. అంతేకాక కవుల భావాలలో రచనా విధానంలో పాత్రల నిర్మాణంలో, కథను ఎన్నుకోవడంలో పూర్తిగా ఆంగ్ల ప్రభావం ప్రసరించినప్పటికీ సంప్రదాయ బద్ధమైన రచనకు మాత్రం తెలుగు కవులు ఇప్పటికినీ ప్రాచీనాంధ్రసాహిత్యాన్ని, నేటి ఆంగ్ల సాహిత్యాన్ని యీ రెండింటిని చక్కగా సమన్వయించుకొని కావ్యరచనగావించుచున్నారు.

క్షేత్రకావ్యాలలో ప్రాణభూతమైన అంశము కవిప్రతిభ. కావ్యమునకు కీర్తి ప్రతిష్ఠలు కలగాలంటే, కావ్యం సృష్టించు కవికి ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసము ఉండాలి. యీ మూడు లక్షణాలు కావ్య ప్రతిభకు గీటురాళ్లు కాగలవు. అంతేకాక కవి ప్రతిభావంతుడైననూ, తగినభాషా పాటవం లేనిచో అతని ప్రతిభ రాణించదు. రెండునూ ఉన్నపుడే కావ్యము వినూత్నమైన పథంలో నడిచి, కవికి శాశ్వతమైన యశస్సును కలిగించును.

ఆ విధంగా ఆలోచిస్తే 'దక్షారామము పెనుగొండలక్ష్మి,హంపీ క్షేత్రము, అమరావతి' వంటి క్షేత్రకావ్యాలలో పైని పేర్కొనబడిన కావ్యలక్షణాలు ఎంతవరకు ఉన్నాయో చూడగలం !

ఆధునికాంధ్ర సాహితీ నందనోద్యానంలో పుష్పించి ఫలించిన మధుర ఫలాలలో ఒక్కటి 'దక్షారామము', దీనికర్త శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు. మొదట భావకవితా ప్రవాహంలో భావకవిగా ప్రవహించి, మధ్యలో అభ్యుదయకవిగా రాటుదేలి తుదకు సంప్రదాయకవులుగా స్థిరపడిన ఆధునిక కవికుల తిలకులు వీరు. నేటి ఆధునిక సాహిత్యలోకంలో హనుమచ్ఛాస్త్రి గారికి దక్షారామకవిగానే గుర్తింపు కలదు. భావకవిగా తమసాహిత్య యాత్ర ప్రారభించి, బ్రహ్మసమాజ ప్రభావాలకు లోనై, నాస్తికవాదాలబలాలు చెలరేగిన తరువాత శాస్త్రి గారిలో సంప్రదాయ వాసనలే చివరకు మిగిలాయి. ఆ బలంతోనే దక్షారామ కావ్యాన్ని వినిర్మించారు. తద్ద్వారా వారి సంప్రదాయబల మెట్టిదో యీ కావ్యంలో వ్యక్తమౌతుంది.

దక్షారామము సుప్రసిద్ధ శైవక్షేత్రము. ప్రఖ్యాత త్రిలింగాలలో భీమేశ్వరుడు ఒకడు. దక్షారామాన్ని గూర్చి పురాణాలు చెప్పుకథలు వేరు, చరిత్ర చెప్పు కథలు వేరు. ఈ దక్షారామానికి సంబంధించిన పురాణకథనే తీసుకొని శ్రీనాథ కవిసార్వభౌముడు భీమ ఖండాన్ని వెలయించాడు. భీమఖండకథ దక్షునికథతో ముడివడియున్నది.

శాస్త్రి గారి పూజాపీఠమునందలి తెలుగు కవులలో శ్రీనాథుడు అగ్రగణ్యుడు. అందువలననే శ్రీనాథుని మీదగల గాఢమైన అభిమానం,– దక్షారామక్షేత్రాన్ని సందర్శించుటవలన కలిగిన అనుభూతీ– ఈ రెండునూ దక్షారామ కావ్యరచనకు ఉద్బోధకాలని శాస్త్రి గారు తత్కావ్యపీఠికలో వ్రాచ్చినారు.

దక్షారామ కావ్యము చదివిన పాఠకులు ఎల్లరును ఇంద్రగంటివారి భావకవితా ధోరణులను, అభ్యుదయ కవితా దృక్పథాలను చక్కగా అర్థంచేసుకొనగలరు. అవి కావ్యప్రతిభను ఆటంకపరచలేదు. పైపెచ్చు దోహదకారులైనవి. ఈ కావ్యములో ఆముఖము, దర్శనము, ప్రథమదృశ్యము ద్వితీయ దృశ్యము, తృతీయదృశ్యము వంటి విభాగాలుకలవు. ఇందు ప్రతిఒక్క విభాగంలోనూ, కవి వ్యక్తంచేసిన జాతీయాభిమానం, సంస్కృత సమాస భూయిష్ఠమైనరచన స్పష్టంగా అర్థమౌతాయి. ఈ క్రిందిపద్యం ద్వారా వారివృత్తరచనా విధాన మెట్టిదో మనకు అర్థంకాగలదు.

"స్వాగతమోయి వేదపర
మార్థవిదాంవర వ్యాససన్మునీ !
స్వాగతమయ్య భారత మ
హా కవిశేఖర జ్ఞానమూర్తి స
ర్వాగమ తత్త్వవిత్తమ సి
తాంబుజ కంబు పటీర వాస్తుషా,
రాగ సమానకీర్తివిభ
వాదయసేయుము దక్షిణోర్వికిన్"

వృత్తపునడక కొరడా విసిరితే ఎలా ఉంటుందో అలా ఉండాలి. అది ఒకనన్నయ గారికే బాగా తెలుసునని వారిభావన. ప్రస్తుతపద్యము 'మహర్షి' అను విభాగంలోనిది. ఇది ఒక ప్రముఖకవిపుంగవుడు మహర్షియైన వ్యాసభగవానుని ఆగమనాన్ని వ్యక్తంచేయుచున్నది. వ్యాసుడు కాశీలో అన్నపూర్ణావిశ్వేశ్వరుల మీద కినుక వహించి, ప్రవాసియై తన శిష్యులతో కూడా దక్షిణదేశానికి బయలుదేరును. మార్గాంతరాన దక్షారామ క్షేత్రం దగ్గర అతనికెదురేగి అగస్త్యుడు ఘనమైన స్వాగత మిచ్చుట పైపద్యమందలి భావము.

ఇక కావ్యానికి సంబంధించినంతవరకు ముఖ్యమైనది కవితత్త్వం. అది యీ క్రింది పద్యంలో వ్యక్తకాగలదు.

"ఉన్నగంటమ్మునకుఁ జేవ యుడుగలేదు
ఈశిరస్సున ధిషణ యింకలేదు
అంజలిఘటింప నతడు ఫాలాక్షుడేని
తెగువ నన్న క్రమమ్ముగా ధిక్కరింప"

వ్యాసుడు కాశీ విశ్వేశ్వర దంపతుల మీద కలిగిన కోపాన్ని అగస్త్యునకు ఆసందర్భాన వివరించుచున్నాడు. కవి వ్యాసుని సహజకోప, గంభీర స్వభావాలను రమ్యంగా వివరించాడు. దీని వలన శ్రీ శాస్త్రి గారి సహజమైన మనస్తత్వం కూడా యిందు వ్యక్తం కాగలదు. ఇక కవి ప్రతిభావంతుడు. సంస్కృత సమాస రచనాధురంధరు డనుటకు నిదర్శనంగా యీ క్రిందిపద్యాన్ని పేర్కొనవచ్చును. ఈ ఒక్క పద్యమే శాస్త్రి గారిని దక్షారామ కవిగా కూడా నిలబెట్టు ననుటలో అతిశయోక్తి లేదు.

గౌరీకోమల వల్లికా శ్రితము, గం
గాఫేన పుష్పోత్కరం
బారక్త స్ఫుట జూటజూట కిసల
వ్యాసక్త ముద్బాహుశా
ఖారమ్యమ్ము, కృపాలవాలము ఫలౌ
ఘత్యాగ శీలమ్ము ద
క్షారామ స్థిత కల్పభూరుహము కాం
క్షల్ దీర్చు మా కెప్పుడున్"

క్షేత్రకావ్యాలలో చెప్పుకొనదగిన మరియొక్క క్షేత్రకావ్యం 'హంపీక్షేత్రము' దీనిని రచించినవారు ప్రముఖ ఆధునిక తెలుగుకవి శ్రీ కొడాలి వేంకట సుబ్బారావు గారు. ఇది క్షేత్రకావ్యాలకు తలమానికమువంటిది. శ్రీకృష్ణదేవరాయలు పరిపాలించిన విజయనగర సామ్రాజ్యంలోని ఒక ప్రముఖ స్థలము 'హంపి'. ఇది శ్రీరాయలవారి కళాచాతుర్యానికి గీటురాయిగా నిలిచింది. కావున 'హంపి' ఒక క్షేత్రముగా పరిగణింపబడి చారిత్రాత్మక ప్రదేశంగా చరిత్రలో నిలిచిపోయింది. ఈ 'హంపి' నే ఆధారంగా తీసుకొని, రాయలకథను కావ్యవస్తువుగా స్వీకరించి 'కొడాలి' వారు 'హంపీక్షేత్రము' అను ఒక మహోత్కృష్టమైన కావ్యాన్ని వెలయించారు.

కొడాలి వేంకట సుబ్బారావు గారు అత్యాధునికులైన కవివరేణ్యులు. ఆయన

వ్రాసిన తొలికావ్యము, తుదికావ్యము 'హంపీక్షేత్రము.' వీరు సుప్రసిద్ధ కవి వరేణ్యులైన విశ్వనాథవారికి శిష్యులై, అపూర్వప్రతిభా సంపత్తులతో, అఖండ పాండితీగరిమతో 'హంపీక్షేత్రము' వంటి సుప్రసిద్ధ కావ్యాన్ని వెలయించి కాల గర్భంలో కలిసిపోయారు.

వీరి కవిత్వంలో ప్రాణభూతమైన అంశాలు–జాతీయాభిమానము, సంస్కృత సమాసభూయిష్ఠమైనరచనము, శబ్దాలంకారములు, అఖండమైన ప్రతిభ, శైలి, పాకము, రీతి మొదలగునవి. హంపీక్షేత్రమును చదివిన పాఠకులకెల్లరకును కవి ప్రతిభావంతు డన్నవిషయం స్పష్టంగా అర్థంకాగలదు. ప్రతిభకుతోడు తగినటువంటిభాషా పాటవముకూడా ఉండుట చేత పూవుకుతావి అబ్బినట్లు అతని ప్రతిభ కావ్యమెల్లెడల రాణించి, కవికి కీర్తిప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన దని చెప్పవచ్చును. అతడు వృత్తరచనలో సమర్థుడనుటకు దృష్టాంతపూర్వకంగా ఈక్రింది పద్యాన్ని పేర్కొనవచ్చు.

"శిలలు ద్రవించియేడ్చినవి
జీర్ణములైనవి తుంగభద్రలో
పల గుడిగోపురంబులు స
భాస్థలులైనవి కొంపముచ్చు గుం
పులకు చరిత్రలో మునిగి
పోయిన దాంధ్రవసుంధరాధి పో
జ్జ్వల విజయప్రతాపరభ
సంబొక స్వప్న కథావిశేషమై"

ఒకనాడు వైభవంగా వెలిగిపోయిన యీ రాయలనాటి వైభవమంతా నేడు నశించిపోయింది. అది ఒక్క స్వప్నంలోని గాథవలె మిగిలిపోయిన దని కవిగా తన బాధను పైవిధంగా వ్యక్తంచేసారు శ్రీ కొడాలివారు. నశించిన వైభవాన్ని పునశ్చరణచేస్తూ పాఠకులకు అర్థమగురీతిలో రచనచేయుట ఒకకళ. అది కొడాలి వారికి బాగా అబ్బింది.

ఇక కొడాలివారి రాజకీయచాతుర్యాన్ని అర్థంచేసుకోడానికి ఆయన ఒకే వృత్తంలో విద్యారణ్యుల వారిని, గాంధీగారిని వశిష్ఠుని ఒకేరీతిగా సమన్వయించుట పరిశీలింపదగ్గది అది యీ క్రింది పద్యంలో వ్యక్తం చేసారు.

"అపుడు పురాణకాలమున
యందు వశిష్ఠుడు; రాజ్యవేత్తలన్
నిపుణుడు సాధుపుంగవుడు
నేడు మహాత్ముడుగాంధి తెల్గుభూ
మిపతి చరిత్ర వేళను సు
మీ యుగమధ్యమునందు నీవు; మా
తృపదనితాంతపూజకు వి
ధించిన బ్రహ్మము మూడుమూర్తులా!"

అన్నింటికంటే చెప్పుకోనదగినది కొడాలి వారికి తెనుగు జాతిమీద గల వెఱ్ఱి అభిమానం. గతచరిత్రను గూర్చి తలపోయుచూ__

"ఆడుచున్నది రెక్కలార్చిగరుత్మతి
తెలుగుజెండాక్ర తీసిరేల
పిలుచుచున్నది పాలపిట్టరాయల వేళ్ల
వరుసగా గద్దెనెక్క రనియేల"

అని బాధపడ్డారు. ఈ విధంగా హంపీక్షేత్రము రచించి తద్వారా సాహిత్యలోకంలో స్థిరపడ్డ కవిపుంగవులు శ్రీ కొడాలివారు.

ఇక క్షేత్రకావ్యాలలో చెప్పుకోన దగిన మరొకకావ్యము 'పెనుగొండలక్ష్మి.' దీనిని రచించినవారు సరస్వతీ పుత్ర బిరుదాంకితులు పుట్టపర్తి నారాయణాచార్యులుగారు. వీరిది రతనాలు పండెడి రాయలసీమ. నేడు రాయలసీమ ప్రాంతంలో చెప్పుకోన దగిన, అతికొద్దిమంది అగ్రగణ్యులైన కవులలో వీ రొకరు. వీరు బహుభాషాకోవిదులు. 'పెనుగొండలక్ష్మి' వీరి కవితావైశిష్ట్యానికి మచ్చుతునక. పెనుగొండ ఒక దుర్గము. శ్రీకృష్ణదేవరాయలు ఉత్తరదేశ జైత్రయాత్రిలలో పెనుగొండనుకూడా ముట్టడించి వశపరచుకొన్నాడు. తద్వారా పెనుగొండ రాయలవారి ఏలుబడిలోనే ఉండిపోయింది. అందువలననే కవిరాయలకు సంబంధించిన కథనే కావ్యేతివృత్తంగా స్వీకరించి, కావ్యరచన సాగించాడు.ఇందులో పెనుగొండలోనికోటలు, రాజవీథులు, శిల్పము, రాయలకళాభిరుచి మొదలగు అంశాలను విభాగాలుగా విభజించి కావ్యరచన సాగించా రని చెప్పవచ్చును. ఇదికూడా 'హంపీక్షేత్రము' వలె, ఒకనాటి వైభవమును గూర్చి ప్రశంసించుచూ, నేడు అది తెఱమఱుగై నశించిపోయి నందులకు దుఃఖపడుచూ రచింపబడినది. ఈకావ్యంలో పుట్టపర్తి వారి బహుభాషాపాటవం, పాండితీ వైభవం, కవితావైశిష్ట్యం అర్థంకాగలవు.

కొండూరి వీరరాఘవాచార్యులుగారు కూడా తమ 'అమరావతి' కావ్యాన్ని చక్కగా రచించారు. అమరావతి ఒక శైవక్షేత్రము. ఇందలి దేవుడు అమరేశ్వరుడు. ఇది పంచారామములలో ఒకటి. అమరావతిని శాతవాహనులు పరిపాలించారు. ఇందు బౌద్ధమతానికి సంబంధించిన ఎన్నోశిల్పాలు ఉన్నాయి. ఆచార్య నాగార్జునుడు అమరావతికి ప్రాముఖ్యమిచ్చాడు. అందువలననే 'కొండూరి' వారు ఈకథను కావ్యేతివృత్తంగా స్వీకరించి రచనచేసారు. అమరేశ్వరునకు సంబంధించినకథ పురాణాలలోకూడాఉంది. అందువలననే కావ్యరచనకు అనువుగా ఉండురీతిలో మలుచుకొని శ్రీ ఆచార్యులు గారు దీనిని రచించారు. వీరుదర్శనశాస్త్రంలో ఎంతకూలంకషమైన పరిజ్ఞానం కలవారో, క్షేత్రకథల పరిశీలనలో కూడా అంతటి సునిశితమైన మేధాసంపత్తి చూపారు. అందువలననే వీరిచేతి నుండి అమోఘమైన క్షేత్రకావ్యమొకటి వెలువడింది.

ఈ విధంగా యీనాలుగు క్షేత్ర కావ్యాలు ఆంధ్రసరస్వతికి అలంకార ప్రాయాలు కాగలవు. ఇందులో ఒక దానిలో జాతీయాభిమానం, మరొక దానిలో శిల్పం. ఇంకొక దానిలో పద్యపు కట్టుబడి - ఈరీతిగా ఒక్కొక్క కావ్యంలో ఒక్కొక్క ప్రత్యేకత సమకూడియున్నది. ఈ కావ్యాలను మనం సునిశితంగా పరిశీలిస్తే ప్రాచీన క్షేత్రకావ్యాలకు, ఆధునిక క్షేత్రకావ్యాలకు ఎంతయో భేదమున్నదన్న విషయం స్పష్టంగా అర్థమగును.

ఈనాటి అధునిక తెలుగు సాహిత్యంలో చోటుచేసికొన్న సాహిత్యప్రక్రియలలో 'ఈ క్షేత్ర కావ్యాలకు' విలక్షణమైన స్థాన ముంది. ఎందుచేతంటే ఇవి ప్రాచీనమైన సాహిత్యంతో ముడిపడి యున్నాయి కనుక. అంతేకాక వీనిలో ఆంగ్లసాహిత్యసౌరభాలు అక్కడక్కడ దిఙ్మాత్రంగా వెల్లడి యౌతాయికాబట్టే, ఆధునికులకు ఇవి మిక్కిలి ప్రీతి పాత్రములు కాగలవు.

ఆధునిక తెలుగు సాహిత్యప్రక్రియలు సాహిత్య లోకంలో చోటు చేసికొంటున్నా, అవి ఏవీకూడా స్వతంత్రమైన ప్రతిపత్తిని పొంద గలిగియుండుట లేదు. ఎందువల్లనంటే అవి పరభాషా ప్రభావాలను పొంది యుండుటయే వానికిగల ప్రత్యేకలోపం. కానీ

ఈ క్షేత్రకావ్యాల వలన ఆలోటుభర్తీయగుటచేత అవియును, వానిని రచించిన కవులును సాహిత్యలోకంలో స్థిరంగా నిలిచి భావిసాహిత్యానికి ఆదర్శప్రాయులగుదురని నావిశ్వాసము.

❦

అభ్యుదయ కవిత్వపు కడఅంచులు తాకిన

# శ్రీ అద్దేపల్లి 'అంతర్జ్వాల'

— శ్రీ కర్రా కార్తికేయశర్మ.

కాకినాడ మహాపట్టణంలో మెయిన్ రోడ్డు మీద నడచి నడచి, జగన్నాథపురం వంతెన దాటి, రద్దీబజారును అతిక్రమిస్తే కుడిచేతివైపున ఒక దేవాలయం కనబడుతుంది. దాని ప్రక్కసందుకు మళ్ళి కొంతదూరం నడిస్తే 'చిక్కాలవారివీథి' వస్తుంది. ఆవీథిలో 'తెలుగుమాష్టారి యిల్లు ఎక్క' డని అడిగితే ఎవరైనా చెప్తారు. ఆ ఇంటికి వెళ్ళి తలుపు తడితే మెరిసే కళ్ళతో, తెల్లని దరహాసంతో, తెలుగు సినిమాహీరోలా ఒకవ్యక్తి మనకు దర్శనమిస్తారు ఆయనపేరు శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు. ఆయన శ్రీశ్రీమహాప్రస్థానానికి వ్యాఖ్యాన గ్రంథంగా 'శ్రీశ్రీకవితా ప్రస్థానం' వ్రాశారు. ఉమర్ ఖయ్యాం రుబాయీలకు తెలుగు అనువాదంగా 'మధుజ్వాల' అనే చిరుపద్య కావ్యం వ్రాశారు. అభ్యుదయ కవిత్వంలో మకుటాయమానమైన 'అంతర్జ్వాల' వ్రాశారు. 'చైతన్యగౌతమం' అనే వచనగేయ నాటిక వ్రాశారు. ఇంకా ఎన్నో వ్యాసాలు, కవితలు తెలుగు పత్రికలకు విరజిమ్మారు.

ఆయన అద్భుతంగా మాట్లాడగలరు. అత్యద్భుతంగా వ్రాయగలరు. తెలుగు పత్రిక లన్నీ ఆయనను ప్రచురించాయి. తెలుగు వేదికలన్నీ ఆయనను ఆహ్వానించాయి. ఆయన కలం, గళం రెండూ కూడా సామాజిక స్పృహను కలిగి ఉంటాయి.

## 2

అద్దేపల్లి కవిగా, విమర్శకుడిగా తెలుగుదేశానికి సుపరిచితుడు. ఆయనను విమర్శకునిగా నిలబెట్టిన గ్రంథం 'శ్రీశ్రీ కవితా ప్రస్థానం.' కవిగా నిలబెట్టిన కవితా సంపుటం 'అంతర్జ్వాల.' 'ఆధునిక కవిగా పుట్టాను. ఏది వ్రాసినా చెల్లుతుంది' అనే ధోరణి గల వాతావరణంలో కవిగా కళ్ళు తెఱచిన అద్దేపల్లి తన చుట్టూ ఉన్న సమాజాన్ని దర్శించి, మంచి చెడులను అనుభవించి అనుభవసారాన్ని తనకవితల్లో నింపారు. అందుకే అద్దేపల్లి అంతర్జ్వాలలోని చాలా కవితలు సమాజస్వరూపానికి దర్పణాలుగా నిలిచాయి.

సమాజానికి దూరంగా విహరిస్తూ కవిత్వం వ్రాస్తే దానికి ఆకవి యొక్క పలుకుబడివల్ల అకాడమీ అవార్డు రావచ్చేమోకాని, ప్రజలదగ్గరకు వెళ్ళి వారి గుండెల చప్పుళ్ళను వినే అర్హతను కలిగి ఉండదు. ప్రజలకు దూరమైన కవిత్వం ఎన్నిసత్కారాలు పొందినా, భవిష్యత్తును చూడదు. పదికాలాలు మన్నదు. ఇది మనకు చరిత్ర చెప్పిన 'నగ్నసత్యం.' అద్దేపల్లి పేరు వినగానే మనకు గుర్తుకు వచ్చేది అంతర్జ్వాల. అద్దేపల్లికి అంతర్జ్వాలకు ఉన్న సంబంధం మనిషికి మనస్సుకు, సమాజానికి చైతన్యానికి, ఉన్న సంబంధంవంటిది. గాఢమైనది.

ఒక కవి ఎన్నికావ్యాలైనా వ్రాయవచ్చు. కాని ఆయన పేరు తలచుకోగానే జ్ఞాపకం వచ్చేది ఒకటే!

ఆధునిక కవులలో...
శ్రీశ్రీ - మహాప్రస్థానం
ఆరుద్ర - త్వమేవాఽహం
సి. నా. రె - కర్పూర వసంతరాయలు
కుందుర్తి - తెలంగాణా
ప్రాచీనకవుల్లో ... (ఆధునికులలో ప్రాచీనులు)

విశ్వనాథ- రామాయణ కల్పవృక్షం
గడియారం- శివభారతం
పుట్టపర్తి- శివతాండవం
మధునాపంతుల- ఆంధ్రపురాణం
ఓనమాములై- పోతన చరిత్ర
జాషువా - గబ్బిలం

ఇలా కవికి కావ్యానికి అభేదాన్ని సూచిస్తూ-రెండూ స్ఫురణకు వస్తాయి. అల్లాటే అద్దేపల్లి- అంతర్జ్వాల.

3

ఇంచుమించు 1964 నుండి 1970 వరకు అద్దేపల్లి వ్రాసినకవితలు అంతర్జ్వాలగా రూపుధరించాయి. 'ఇది అంతర్ జ్వాల! కవిహృదయంలో అక్రమలోకాన్ని చూడగా జ్వలించిన జ్వాల' అంటారు అద్దేపల్లి.

'పెద్దపెద్ద ఇనప్పెట్టెల్లో
కన్నీళ్ళూ
చిన్నకార్ల టైర్ల అడుగున
గుండెకాయలూ
ఎయిర్ కండిషన్ మేడలపునాదుల్లో
స్వేద ప్రవాహాలూ
బంగారుగుమ్మాలమీద కుంకుమబొట్లలో
నెత్తురు జీరలూ
విందు భోజనాల విస్తళ్ళ కింద
ఆకలి చావులూ
తాగితాగి తూలే వాళ్ళ అరికాళ్ళ కింద
సన్నని అరుపులూ
రాజకీయాల కత్తిఅంచుల పొడుగునా
నిండు బ్రతుకులూ"

ఇవన్నీ కవిహృదయాన్ని కలచివేయగా ఆకలత అలగా మారి జ్వాలగా రూపు కట్టింది. సమాజగమనాన్ని పరిశీలించే ఏ కవి అయినా ఈ దృశ్యాలు చూచి స్పందించక మానడు. ఆ స్పందన కేవలం బాధల వర్ణన కాకూడదు. పరిష్కార మార్గాన్ని అన్వేషించే 'దృష్టి' కావాలి. అట్టి దృష్టికల కొద్దిమంది కవుల్లో అద్దేపల్లి ఒకరు.

"ఎట్లారక్షించాలి ఈ బ్రతుకుల్ని ?
మనందరి ఊపిరి బలంలోనుండి
కంఠనాదంలో గర్జించేసంకల్పంలోనుండి
గట్టిగా విసురుతున్న చేతులలోనుండి
ఒక మహా ఝంఝుమారుతాన్ని
సృష్టించాలి
కన్నీటితో గట్టిపడ్డ హృదయంలో నుండి
ఒక పెను తుపాను కల్పించాలి"

అంటూ బాధల నివారణకు ప్రస్థానం సాగించమంటారు. అప్పుడు

"అనంతకోటి మానవుల మహాచైతన్య వేగానికి ఆమంట లారిపోక తప్పదు"
అంటూ ఆశావాదాన్ని ప్రకటిస్తారు.

ఇక 'భయంకర భవిష్యత్తు' అనే కవితలో 'సంప్రదాయోపన్యాసాల తెరలవెనుక నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానపుముసుగుల క్రింద నిర్లిప్తతా సన్యాసాల ప్రకటనల మరుగున దైవభక్తి ప్రకంపిత శరీరాల అణువణువునా స్వార్థం! కామం! డబ్బు!' అంటూ సంప్రదాయాల 'ఫార్సు' పై ఒక కలం పోటు పొడిచారు. అంతేకాకుండా

'ఆధునిక మానవుడనే లయకారుడు
స్వార్థం, కామం, డబ్బు -
అనేదారుణ త్రిశూలంతో
భయంకర తాండవంచేస్తున్నాడు.
అతని ఒంటి నుంటి రాలే బూడిదలోనుండి
భవిష్యత్ సమాజం రూపందిద్దుకుంటోంది."

అంటూ 'భయంకర భవిష్యత్తు' పట్ల ఆవేదన వ్యక్తపరిచారు.

పదిమందికోసం కలంపట్టిన ఆధునిక కవి ఆపదిమంది క్షేమాన్ని వాంఛిస్తాడు. ఆ క్షేమానికి క్షామం ఏర్పడుతున్న తరుణంలో ఆవేశపడతాడు. ఆవేదనను అనుభవిస్తాడు. అప్పుడు ఆ కవి చూపు సమాజగర్భంలోకి చురకత్తిలా దూసుకుపోతుంది. ఆతణ్ణి ఎవ్వరూ ఆపలేరు.

'ఈనాడే వృద్ధుడూ నా భవిష్యత్తుపై
భూతాన్ని నిలుపలేడు
ఈనాడే దేవుడూ నా కాళ్ళపై
కర్మబంధాలు విసరలేడు'-
అని సవాల్ చేశారు అద్దేపల్లి.

4

'మతం అనేదినల్లమందు వంటిది' అంటాడు లెనిన్. అద్దేపల్లి అభిప్రాయం కూడా అదే. ఈసమాజం పతనమై పోవడానికి సహకరించిన ఎందరో పెద్దలలో మతోన్మాదులు కొందరు. ఏవాదమైనా పునాదులను ఆధారం చేసుకొని పురోగమిస్తే పరవాలేదు. ఆవాదం ఉన్మాదంగా మారితేనే చిక్కు. 'మానవుడు తన అసహాయతను కప్పిపుచ్చుకోడానికి దేవుణ్ణి నిర్మించాడు' అంటారు అద్దేపల్లి వారికి దేవుడు కనుపించాడు.

'ఈప్రపంచంలో భగవంతుడుదాగిన
ప్రదేశం కోసం గాలించాను
మహాభక్తులు చెప్పారని గుళ్ళోని రాళ్ళను
పరిశీలించాను
తత్వవేత్తలు చెప్పారని పండితుల
భాష్యాలు వెదికాను
మానవతావాదులు చెప్పారని శ్రమజీవుల
స్వేదజలంలో చూచాను.
ఈనాటికి నాశ్రమకు ప్రతిఫలం లభించింది! నాదైవాన్వేషణ ఫలించింది !
మొన్న నాలక్షాధికారి మిత్రుని జేబులోని
మనీపర్సునుండి తొంగిచూస్తున్న దేవుణ్ణి
చూశాను.'

'పైసామే భగవాన్ హై' ఎంతో బాగా నిరూపించారు అద్దేపల్లి.

చాలమందిలో ఇచ్చే బోధనలకు, చేసే పనులకు పొంతన ఉండదు శ్రీరంగనీతులు చెప్తూనే మరెక్కడో దూరుతారు. అద్దేపల్లి ఏమంటారో వినండి.

'వేదాలరహస్యాలు బోధించే మహాత్ముడికి
వేదోపన్యాసాలు ప్రజలనుండి డబ్బు
పిండాలి
ఆయన కొడుకులు నవీనసంస్కృతికి
అద్దాలుకావాలి
ఇంగ్లీషు చదవాలి - సిగిరెట్లు కాలవాలి
తమకడుపులో దాగిన మృగాలు
వారిముఖాలమీద తాండవం చెయ్యాలి'
అని కొందరు సంప్రదాయవాదుల
అంతర్యాన్ని బహిర్గతం చేశారు.

( తరువాయి 15 పేజీలో )

కవికోకిల కమనీయ కల్పన

# జలదాంగన

– డా॥ జి. బి. ఎన్. ఆచార్య, ఎం.ఏ., పిహెచ్.డి.
తెలుగుశాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం.

( 23 వ సంచిక తరువాయి )

'శీతగిరి గాంచినంతనే చిత్తమందు
వెలుఁగుచున్న నమర్ష కీలలు శమించెఁ;
జొట్టుపట్టుల నడయాడి చూత మంచుఁ
దరలితిని మంచుగడ్డనెత్తమ్ములకును.'

అంతట కవిగారు ఆమె భాగ్యమునకు అభినందించుచు, నాకు గూడ నీకువలెనే ఎక్కడనైనను విహరించుశక్తి లేదుగదా! అని బాధపడుచు – 'అంతటినోము నోయలేదో నరులకక్కటా! గఱులతో నొక పుల్గునైనఁ బుట్టనే?' అనుచు తాము ప్రకృతిగా జన్మింపనందుకు బాధపడినారు. దీనినే ప్రకృతితో తాదాత్మ్యమును పొందుట యందురు. ప్రకృతివర్ణన ప్రియులైన భావకవులు పైవిధముగా సంభావించుకొనుట మనకు అందరి యందును కనిపించును. 'పక్షినయ్యేద చిన్ని ఋక్షమయ్యేదను' (కృష్ణపక్షము) అను దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారి ఆకాంక్ష ప్రకృతి తాదాత్మ్యమునే వివరించుచున్నది.

'అవుగాని యాటుమీఁద నాకొంత మంచుగ
డ్డలు ప్రీలఁ బగుళుల నొలుకుచున్న
సెలయేళ్ళ వెండికమ్ములలీలఁ జాల్కొన
నటకేఁగి చలినీళ్ళయందు దోఁగి,
బలువైన మంచుతుప్పలు గాలి, దూలిన
నోరగా నటునిటు నోసరిలుచుఁ,
గన్నులు గట్టియు గట్టక మాయ మా
కలయట్లు నెల్లెడఁ గలయఁ దిరిగి

విష్ణుపాదాబ్జమునఁ బుట్టు మిన్నువాఁక
వెడలుగుహాకడ నొకకొంత వేచిచూచి
శంకరుని యెద్దుగిట్టలజాడఁబట్టి
గదలిపోతిఁ గైలాస శృంగంబుదరికి.'

అని చెప్పుచు కైలాసమునుగూడ రమణీయముగ వర్ణించి –

'ప్రకృతి యాత్మయు మిళితమౌపగిదిఁ దాండ
వించు నర్ధనారీశ్వరు వేడ్కఁ గంటి!'

నని ఆనందించినది. ఆతరువాత బదరికాశ్రమమునందలి యజ్ఞవాటికలను గాంచినదట. అటనుండి విధివశముచే ఒక మటుమాయల కొలను గాంచి, అందుమునుగగా మంచుతాయిగా మారిపోయినదట. అక్కడకు జలజాప్తుడు చేరవచ్చి ఆమెను ఓదార్చి, పరిచర్యలు చేసి తప్పు క్షమింపుమని దీనుడై వేడుకొనినాడు.

అంతట ఆమెకు పట్టరాని రోషము కలిగినది.

"...నిర్ఝరగర్భమందు సం
ప్రీతిగనీనమైతి; నిదిమేలె యగుంగద
నన్నుబోఁటికిన్ !"

అని అనుకొనినది' పదను మరచిపోయి, ఆమెను కష్టమును గాంచి సవతియైన 'పృథ్వి' ఆమెను శమియింపజేసి, కొన్ని దినములవరకు తన ఇంటనే నిలుపుకొన్నది. కొంతకాలము గడచిన పిదప నిజాలయమున కేగగోరి ఆమె –

'బలిసి, కూలంకషంబుగఁ బాఱునదుల
గలసి, స్వస్థాన మేఁగితిఁ గాంక్షదీఱ;
దేనికై మూఁగు నీఁగల తెండె మటులఁ
బిల్లలెల్లరు ననుగూడి ప్రియము నిడిరి.'

అని మురిసిపోయినది. ఇందలి యుపమానము జనసామాన్యమైనది. మిక్కిలి ప్రసిద్ధమైనది. ప్రసిద్ధమైన ఉపమానములను గొని చెప్పదలచుకొన్న విషయమును విస్పష్టముచేయు నేర్పు రెడ్డిగారికి గలదనుట కిది నిదర్శనము.

"కాంతునుపేక్షచే నయిన
కష్టము బిడ్డల ముద్దుముచ్చటం
గొంతశమింపఁజేయుచటు
కొన్నిదినంబులు పుచ్చనొక్క నాఁ
డెంతొ మనోహరాకకృతి వ
హించి సరోజహితుండు రాఁగ నా
స్వాంత మిఁకేమి సెప్ప? రెప
లాడెను బూర్వము విస్తృతంబుగాన్."
'ఏమిది?' యన్నయంత తడ
వేమియులేదుపగూహనంబునన్
గోమలి బాష్పరూప నయి
కూడన యేఁగి నభోంతరంబునన్
శ్యామలకోమలాంబుదము
నైచరియించుచునున్న దాన, నిం
కే మన కేమి లాభము? క
వీశ్వర; యూరెను బోయెదింతకున్.'
'ఇంతకైనను సద్గుణవంతుఁ డగుచు
గాఁపురంబగడు సేయక గడపకున్న,
నింక నీ మోసముల నెవ్వ రెఱుఁగి వత్తు
రంత కూలికి విషమాను కాంత యొవతె?'

అని చెప్పుచుండుసమయమున చల్లనిగాలీచగా ఆవనద లతాంగి ముసుగును సవరించుకొనుచు వెడలిపోయెను. అంతటకవిగారు గృహముచేరి వేగుజామున శయనించినారట.

'చల్లవెన్నెల, వలిమల, జలదకాంత
మంచుతుప్పలు, సెలయేళ్ళు, లంచబారు
లిందుశేఖరతాండవ మేమొయే మొ
కలను గాంచుచు నిదుర మేల్కొంటినపుడె.'

అని కావ్యమును ముగించినారు.

ఈ కావ్యమునందు మన సంప్రదాయము ననుసరించి, సృష్టి పరిణామము ధ్వనింప జేయబడినది. ఈ సర్వసృష్టికి ముందు అంతయు జలమయ మని కదా తత్త్వవేత్తల యభిమతము. దీని ననుసరించియే కవిగారు తమ కావ్యములో ముందుగా 'వనధి' సృజింపబడిన దని చెప్పినారు. నీరు సూర్యరశ్మిచే అవిరియై మేఘరూపమును పొందు నని విజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. ఈవిషయమును కవిగా

రీకావ్యములో చక్కగా పొందు పరచి నారు. ప్రకృతి వర్ణనయందు పరిణతప్రజ్ఞ కలిగిన కమనీయ కళా తపస్విగాను, శాస్త్రవిజ్ఞానమునకు కావ్యత్వమును కలిగింపగల సమర్థత కలిగిన అఖండయశస్వి గాను, దువ్వూరి రామిరెడ్డిగారు ఈకావ్యము మూలమున మనకు చిరస్మరణీయులు.

మేఘమునకు కవులు స్త్రీపురుషరూపములను రెండింటిని ఆపాదించుట కలదు. రెడ్డిగారుతమ కావ్యమునకు జలదము'ను నాయికగాను, 'జలజాప్తు'ని నాయకుని గానుచేసి ప్రణయమును పొందుపరచి, తాము చెప్పదలచుకొనిన విషయమును ఆకర్షణీయముగా చెప్పినారు. ఈకావ్యము కవిగారి భావనా బలమునకు నిదర్శనము. కల్పిత గాథయైనను, ప్రజల కుపయోగించు మహత్తర విషయములను కావ్యరూపమున ప్రబోధించినారు. ప్రకృతి రహస్యములను తెలిసికొనవలెనను 'జిజ్ఞాస' మానవునకు సహజము. ఆ సహజమైన జిజ్ఞాస వలననే కవిగారు ఈ కావ్యమును రచించినారు. భావుకులైన కవిగారు దీప్తిమంతమైన కవితా శక్తిని వినియోగించి, రసమయముగా ఈ కావ్యమును సృజించినారు. ప్రకృతి కవిని ఆలోచింపచేయు ననుటకు నిదర్శనమైన ఈ కావ్యము ఆపాతమధురము. ఈయొవడిలో తరువాత తరువాత ప్రకృతివర్ణన పరములైన అనేకము లగు ఖండకావ్యములు వెలువడినవి. వానిలో కీ. శే. గుర్రం జాషువగారి 'స్వప్నకథ' గణనీయమైనది. ఆకావ్యమునందు, కవిగారికి కలలో చంద్రమండలములో ఏకులువడకు చున్న అవ్వ ఆతిథ్యము నొసంగి, తన పూర్వగాథను చెప్పినట్లు గలదు. 'కవులు వర్ణించు జింకను గాను' అని మానవతా దృక్పథమును కవిగారు ప్రవేశపెట్టి, నవ్యతను సాధించినారు. 'కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నములు' అను 'భట్టుమూర్తి' వాదమును ఆధునిక ఖండకావ్యములు పరాస్తముగావించు చున్నవి.

మేఘము నుద్దేశించి ప్రత్యేకముగా పద్యాత్మకములైన ఖండిక లనేకములు ఆధునిక కవులచే రచింపబడినవి. వానిలో జాషువగారి 'మేఘుడు', నీలిమబ్బులు' (ఖం. కా. 3వభా.) ; బొడ్డు బాపిరాజుగారి 'ఆషాఢమేఘము' (భారతి 1940, సంపు. 17. సంచి. 8) ; 'నీటి మబ్బులు' (భారతి 1952. సెప్టెం. సంపు. 29. సంచి. 9); 'శ్రావణాభ్రము' (భారతి 1959. సంపు. 36. సంచి. 10); అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారి 'మేఘము' (భారతి ఫిబ్రవరి 1925. సంపు 3. సంచి. 2; ఏప్రిల్ 1925. సంపు. 3 సంచి, 4); మిన్నికంటి గురునాథ శర్మగారి 'మబ్బు' (భారతి. అక్టో. 1930 సంపు. 7. సంచి. 10) ; నారాయణ స్వామిగారి 'మబ్బుతునక' (భారతి. ఆగస్టు 1932. సంపు. 9,సంచి.8); తిరుమల రంగాచార్యులగారి 'ఘనప్రశంస' (భారతి. సెప్టెం. 1932 సంపు 9 సంచి. 9); గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యంగారి 'మేఘాలోకము' (భారతి. ఆగస్టు 1934. సంపు. 11. సంచి. 8) మున్నగునవి ప్రసిద్ధి చెందినవి. వీ రెవ్వరును దువ్వూరి రామిరెడ్డి గారివలె మేఘమునకు స్త్రీత్వమును ఆపాదింపలేదను విషయము గమనింపదగియున్నది. మేఘము నితివృత్తముగా గొని ప్రత్యేకించి వ్రాసిన కావ్యములు గూడ నుండియుండవచ్చును. మేఘమును గూర్చి ఎవరేవిధముగ వ్రాసినను కాళిదాసు 'మేఘసందేశము' యొక్క ప్రభావము కొద్దిగనో, గొప్పగనో యుండు ననుట దోషము గాదు.[1] కేవలము మేఘము 'ధూమజ్యోతిస్సలిల మరుత్తుల' కలయిక మాత్రమే కాదని, మానవీకరించి చెప్పుట నవ్యకవుల విలక్షణతను చాటుచున్నది. ఈ విలక్షణతచే అర్వాచీన కవులు ప్రకృతి వర్ణనయందు ప్రత్యేకముగా గణింపదగియున్నారు.

—...—

1. కాళిదాసు 'మేఘసందేశము' నకు అనువాద కృతులు ఆధునికముగ పెక్కులు వెలసినవి.

---

( 13 వ పేజీ తరువాయి )

మన జీవితం వ్యవస్థ గుప్పెట్లో నలిగి పోతుంటే, సౌమ్యంగా తప్పించుకోగల ఉపాయం దొరకకుంటే, ఎదురు తిరగడం అనివార్యం. ఏ ఆధునిక కవిఅయినా ఇదే సలహాయిస్తాడు. అద్దేపల్లి సలహా ఏమింటంటే

'సమాజ యంత్రంలో ఒక్కసీల
బిగిసే అవకాశ మున్నప్పుడే
నీ కెటువంటి ఆపదవచ్చినా
నీబ్రతుక్కెలాంటి కష్టంకలిగినా
ఎదురు తిరుగు !
పోట్లాడు !
అంతు చూడు!'

## 5

అద్దేపల్లి ఈ 'అంతర్జ్వాల' కవితలు వ్రాస్తున్న తరుణంలోనే దిగంబరకవులు విజృంభించారు. అధివాస్తవిక ధోరణిలో వారికవిత్వం సాగింది. ఫలితంగా ఏ ప్రజలను గురించి వారు కవిత్వం వ్రాశారో ఆప్రజలే దానిని హర్షించలేరు. అందుకే దిగంబరోద్యమం దిగంబరంగానేఅదృశ్యమయింది. అద్దేపల్లిలో ఆవేశమున్నా ఆలోచనకూడా ఆవేశంతో సమంగాఉండటంవల్ల కవిగా ఆయన పాఠకులకు సన్నిహిత మయ్యారు. ఏపదాల పోహళింపు పాఠకులను స్పందింపజేస్తుందో; ఆ'పాఠకనాడి' అద్దేపల్లికి తెలుసు. అందుకే కవిగా ఆయన విజయంసాధించారు.

అంతర్జ్వాల కవితాసంపుటిలో 'అంతర్జ్వాల' మొదలుకొని 'సామాన్యపు లారా రండి' వరకు 48 కవిత లున్నాయి. ప్రతీకవితా ఒకేముద్రగా కాకుండా వేరు వేరు 'ముద్రల' తో సాగాయి.

శ్రీశ్రీ మహా ప్రస్థానం తరువాత మరో మహత్తర కవితాసంపుటి అంతర్జ్వాల. ఇది అభ్యుదయ కవితోద్యాన వనంలో పూసిన ఎర్రటిపువ్వు.

6

గతమూడు సంవత్సరాలనుండి అద్దేపల్లిలోని చైతన్యం అలసిపోయిందేమో నని నాకనిపిస్తోంది. అదే నిజమైతే, ఆ నిజాన్ని అబద్ధంగా మార్చవలసిన బాధ్యత అద్దేపల్లిపై ఉంది.

స్వాతంత్ర్యం వచ్చి ముప్పది యొక్క సంవత్సరాలయినా కవులకలాలు విశ్రాంతి తీసుకునే అదృష్టానికి నోచుకోలేదు. (ఈ మాట నా కంటే ముందే ఎవరో అన్నారు. బహుశః విద్వాన్ విశ్వం కావచ్చు.) అన్యాయాలపై తిరగబడవలసిన అవసరం కవుల కలాల కింకా కలుగుతోంది. అద్దేపల్లి వారి కలం కూడ పూర్వంలా, ఆవేశంగా 'బరి' మీదకు రాక తప్పదు, రావాలి!

"మనిషిని నమ్ముదాంరండి
మనిషి మనస్సును పెంచుదాం రండి
ఒక్క మనిషి పూనికతో వందమంది
జ్వలిస్తారు
ఒక్క మనస్సు మండితే వెయ్యి మన
స్సులు మండుతై
ఒక వ్యక్తి వికాసంలో ఒక మహాసామా
జిక విప్లవం వికసిస్తుంది
ఆచరణలేనివందలాదినినాదాలఅట్టడుగున
ధైర్యం చచ్చిన వేలాది సిద్ధాంతాల
ఊబిలో
గొంతుదాకా దిగబడి నిట్టూర్చే వ్యక్తిని
పైకిలాగి
సామాజిక చైతన్య శిఖరాగ్రాన
నిలబెడదాం రండి!
మన గుండెలన్నింటి నడుమనుండి
ఒక నూతన సంకల్పాన్ని గుచ్చి
అగ్ని జ్వాలా మాలికను కూర్చి
మన చుట్టూ కమ్ముకొచ్చే చీకట్లు
దహిద్దాంరండి
సమాన మానవ వినూతన సమాజాన్ని
నిర్మిద్దాం రండి!




# పవనదూతమ్

సంస్కృతవాఙ్మయమున వాల్మీకి కాళిదాస భవభూతులు దుర్ధర్షమైన కవితామార్గమున నేకచ్ఛత్రమగు ప్రాభవము కలవారు. ఖండకావ్యములకు, సందేశ కావ్యములకు, మూలమైన; జగద్గురు పీఠమునందిన మహాకవితాగురువు కాళిదాసుని మేఘసందేశము ధూమ జ్యోతి రాది సన్నిపాత మేఘసమాశ్రితము. సుమనోమనోహరతా నిబిడమైన వాని మేఘసందేశము నీపాదివార్షుకశ్రీ సముల్లసితమై నిల్చినది. అట్టి నిత్యజ్యోత్స్నా ప్రతిహత తమోవృత్తిరమ్య రాకానిశీథ మనోహర సాహిత్యాకాశమున తద్రమ్యతానుకరణాను గుణశీలము లగు చుక్కలవోలె సందేశ కావ్యములు కొన్ని తోచినవి. అట్లు తోచినవానిలో పవనదూతమొకటి. దీనిరచయిత 'ధోయీ' కవి. వీనికే ధోయి, ధోయీక మున్నగు నామాంతరములు కలవు. ఇతడు 14వ శతాబ్దిలోని లక్ష్మణసేనుని యాస్థాన కవిపండితుడుగా భావింపబడుచున్నాడు. 'గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణస్య చ అనుశ్లోకములోని కవిరాజపదము వీనినే చెప్పు నని 'దంతివ్యూహం కనకలతికాం చామర హైమదండం, యో గౌడేంద్రా దలభత కవిక్ష్మాభృతాం చక్రవర్తీ, శ్రీధోయీకః సకల రసిక ప్రీతిహేతోర్మనస్వీ, కావ్యం సారస్వత మివ మహామంత్ర మేత జ్జగాద' అను పవనదూతాంతిమశ్లోకములలోని దాని వలన నిశ్చయించుచున్నారు.

ఇతడు పవనదూతమున దూతగా పవనుని నిలిపెను. చందనాద్రి యందలి కనకనగరీ నివాసిని యగు కువలయవతి భువన విజయమున లక్ష్మణమహీపతిని జూచి వానియం దాసక్తయై తనయనురాగమును నాతనికి పవనుడు దూతగాఁ దెలిపెను. గౌడదేశమార్గాదిక మిందు వర్ణితము. ఇది నూరుశ్లోకముల గ్రంథము. మేఘసందేశమునవలె నగరాదివర్ణన మిందు కాన వచ్చును. ఇతడును కాళిదాసకవితా సమాకృష్టుడై మందాక్రాంతావృత్తమునే స్వీకరించెను. ఇతనిపదబంధమున కాళిదాసానుచికీర్ష ప్రస్ఫుటముగా గాన వచ్చును. 'హిత్వా కాంచీ మవినయవతీ' భుక్తసంజేముహూర్తం (మేఘసందేశ) సంసర్పంతీ ప్రకృతి కుటిలాం దర్శితావర్త చక్రా (పవనదూత - 34) సంసర్పంత్యాః ప్రకృతి సుభగం దర్శితావర్తనాభేః (మేఘసందేశం) వంటివి ముమ్మరముగా ప్రతిచోటను దర్శనమిచ్చును. ఇట్టి యనుకరణ లౌల్యము దృశ్యమానమగుచున్నను; కొన్ని కొన్ని యితని స్వతంత్రతను పట్టిచూపును.

"యత్ సౌధానా ముపరి వలభీ
సాలభంజీషు లీనా;
సుస్నిగ్ధా సుప్రకృతి మధురా
కేళి కౌతూహలేన
ఉన్నీయంతే కథ మపి రహః
పాణిపంకేరుహాగ్ర
స్పర్శోద్గచ్ఛ త్పులక ముకుళాః
సుభ్రువో వల్లభేన (పవన దూత_27
కీదృక్ కాంతః కథయ తరళే
వర్తతేయ స్తవాంత
యత్నా దిత్థం సుభగబహుళః
పృష్టయాళీజనేన

నిశ్వాసోచ్ఛ్వాసః కథమపి తయా
స్తంభితాశ్రు ప్రవాహో
న్యస్తా దృష్టిః లిఖితమదనే
భిత్తిభాగే గృహస్య ॥

వంటి శ్లోకములు మనోహరప్రాయములై యుండును. క్రీగీటు గీచినచోట 'వల్లభైస్తు' అన్నచో నాయికాగత బహువచనమునకు, నాయకగత బహువచనమునకు పొందిక యుండెడిదేమో? ఇట్లు మార్గ నగర నాయకాది వర్ణనలతో స్వానురాగ ప్రకటనముతో నున్న యీ కావ్యము ప్రచుర ప్రచారము నందకపోవుటకు అనుకరణము, గౌడదేశ రాజగు లక్ష్మణ (సేనుని) గుణప్రశస్తి మితిమీరి ప్రధానమగుట, ముఖ్య కారణములుగా భావింపవచ్చును. ఇట్టి గ్రంథములవలన కాళిదాస గౌరవము ప్రస్ఫుటమగుచు, నాతని యనితరానుకరణీయత్వము సూచితమగును. అనుకరణచే మాటువడినవానిలో నిది యొకటి. కవిచిత్తవృత్తిని నాటి యాతని మాన్యస్థితిని ఈ క్రింది శ్లోకములు వెల్లడించును.

గోష్ఠీబంధః సకలకవిభి
ర్వాచి వైదర్భరీతిః
సత్సు స్నేహః సదసి కవితా
చార్యకం భూభుజాం మే
భక్తిర్లక్ష్మీపతి చరణయో
రస్తు జన్మాంతరేఽపి॥
యావచ్ఛంభు ర్వహతి గిరిజా
సంవిభక్తం శరీరం
యావ జ్జైత్రం కలయతి ధనుః
కౌసుమం పుష్పకేతుః
యావ ద్రాధారమణ తరుణీ
కేళిసాక్షీ కదంబః
తావ జ్జీయాత్ కవినరపతే
రేష వాచాం విలాసః ॥
కీర్తిర్లబ్ధా సదసి విదుషాం
శీతల క్షోణిపాలా
వాక్సందర్భాః కతి చి దమృత
స్యందినో నిర్మితాశ్చ
తీరే సంప్రత్యమరసరితః
క్వాపి శైలోపకంఠే
బ్రహ్మాభ్యాసే ప్రయతమనసా
నేతు మీహే దినాని.

పవన దూతము మేఘసందేశమువలె సద్యస్స్ఫూర్తి సుమనో మనస్కము కాకపోయినను; ధోయీకవిరాజ వాక్ప్రౌఢిమ నరయుటకైన పఠనీయము. మేఘసందేశ రసార్ద్రితను మరచి, గాఢోర్వీనాథుని వర్ణనాతిశయమును విడిచి, చూచిన; నిది యుత్తమకావ్య మను నిశ్చితాభిప్రాయము కల్గును. చివరి శ్లోకములలోని వాని మనస్థితి, శీతలక్షోణిపాలస మాసవైచిత్రిని విడిచిన; మనచేతులను జోడింపజేయు ననుటలో సందేహము లేదు.



# ఈ పక్షంలో

## కవన విజయ సభ

11-10-78 బుధవారం సాయంకాలం గం. 5-30 లకు రాజమండ్రి దుర్గా వెంకట రమణారావు కల్యాణ మండపంలో ఆంధ్రకేసరి యువజనసమితి యాజమాన్యాన కవి శతంసులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారి అధ్యక్షతను కవన విజయసభ విజయవంతముగా జరగినది. అప్పటివఱకు లేని విద్యుచ్ఛక్తి సభాప్రారంభ క్షణంలో రావడం హర్షదాయకమైనది. వివిధరంగముల ప్రసిద్ధులయిన పురప్రముఖు లధిక సంఖ్యలో విచ్చేసి సభావిజయమునకు తోడ్పడిరి. ఔచిత్యానౌచిత్యము లెట్లున్నను నేడు ప్రతి సభ వేదాశీస్సులతో ప్రారంభంకావడం అనే ఆధునిక సంప్రదాయం ఇక్కడా పాటించబడింది.

ఈమధ్య ఆంధ్రదేశంలో బహుళంగా ప్రవృత్తం అవుతున్న భువనవిజయంకన్న నూతనోన్నత ప్రక్రియలో ఈ కవన విజయం జరపబడుచున్న దని కార్యనిర్వాహకులు, అధ్యక్షులు, వివరించడం జరగింది. సభలో పాల్గొన్న ప్రతికవికీ మూడావృత్తులు, ఆవృత్తులయందు ప్రవచింపవలసిన అంశములూ, కాలమూ నిర్దిష్టములైనవి. తెలుగునేల నలుచెఱగులనుండి ఆహూతులయిన వారిలో ఒక శ్రీ యస్.వి. జోగారావుగారు తక్క మిగిలిన అందఱు సభకు విచ్చేసిరి. వారందఱిలోను ఒకరిద్దఱు తక్క మిగిలినవారు కళాశాలోపన్యాసక స్థాయికి తగ్గని లౌకికపదవీ నిర్వహణ

ధూర్వహతగలవా రౌట వారి కవితా ప్రాగల్భ్యవైశిష్ట్యాన్ని ఇనుమడింపజేసింది అనవచ్చును.

ఆరంభము కరుణశ్రీ ప్రసిద్ధులు శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు కావించిరి. తమకు పోతన అభిమానపాత్రుడనిరి. పోతన భాగవతమందలి పెక్కు పాత్రలు మరవరాని వనిరి. చెప్పితే పోతన వలెనే హృద్యము, నిరవద్యమూ అయిన కవిత చెప్పవలె ననిరి. నిరవద్యము అన్నది ప్రత్యేకాభిప్రాయ విశిష్టముకాదనీ, నన్నయ తిక్కనాదుల యెడల శ్రీ వారికి గౌరవభావము తక్కువకాదనీ సహృదయతతో మనము భావింపవచ్చును.

శ్రీ సోమసుందర్ ప్రత్యేకించి తనకు అభిమానకవి లేడన్నారు. కవి సన్మానం కంటె కవితలను అధ్యయనం చేయడం ప్రశస్తమన్నారు. కవులనుండి, కవితలను వేఱుపఱచడం కష్టమే అన్నారు. పై వారి అభిప్రాయాలను కాదనేవా రుండరు కాని విష్ణుచిత్తుడు చేతకానివాడనడాన్ని ఎంతమంది సహిస్తారన్నది సందేహం.

శ్రీ అంతటి నరసింహంగారు శ్లేష చమత్కృతులతోడి కవిత్వం మెచ్చదగినది అనీ చంద్రోదయవర్ణనలో నాయికా వృత్తాంత ప్రతీతి సుమనోహర మనీ అన్నారు. శ్లేషచమత్కృతి మాత్రమే రసవత్కవితకు ప్రధానతమం అని తత్‌జ్ఞు లంగీకరింపగలరా? అని సందేహం.

శ్రీ కులపతి (ప్రసాదరాయ) ప్రాచీన కవు లందరూ ఆరాధ్యులన్నారు. వారి హృదయవైశాల్యము స్తవనీయము. అసత్యేన రజసా ... మంత్ర కవితాస్రష్టను ప్రశంసించిన విధము అపశ్రుతిభూయిష్ఠమనక తప్పదు. ప్రాచీన మహాకవులను అభిమానించకుండా స్మరించకుండా ఉండడం దౌర్భాగ్యం అనే భావాన్ని వారు వెలువరించడం శ్రీ సోమసుందర్ పై నిశిత విమర్శ అని అందఱికీ వ్యక్తమయ్యే విషయం. కవితాధ్యయనం ప్రాముఖ్యాన్ని నిరూపించడమే సోమసుందర్ వచనముల ధ్యేయంకాని ప్రాచీన కవుల్ని విస్మరించడం, న్యూనపఱచడం కాదని గ్రహిస్తే ఇంత తీవ్రపడవలసిన అవసరం కనిపించదు. కవి-కవితలను వేఱుపఱచి గౌరవాగౌరవాలని ప్రదర్శించడం కష్టం అన్న సోమసుందర్ వాక్యం పరిశీలనార్హం కదా.

శ్రీశనగన నరసింహస్వామి ప్రాచీన కవులలోనూ వైవిధ్యం ఉన్నది. కవితాతత్త్వం తెలిసి అభిమాన కవిని నిర్ణయించుకోవాలి. అన్నిరచనలూ చదవాలి అన్నారు. నిర్వివాదమైన అంశం.

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ కాం చెన్ వైష్ణవుడు పద్యంలో ఏ కవితాలేశమూ లేదన్నారు. అర్థం కాదన్నారు. ధ్వని ప్రధానంగా కవిత్వం వుండాలన్నారు. అభిమాన కవి కృష్ణరాయలూ బాలగంగాధరతిలకూ అన్నారు. 'కాం చెన్ వైష్ణవ' పద్యంలో వారి కే ధ్వనీ శ్రూయమాణం కాకపోవడం విచిత్రం. వారు పఠించిన తిలక్ రచనతో కాం చెన్ వైష్ణవుడు పద్యంతో పొందిన అనుభూతికంటె ఎంతఎక్కువ అనుభూతి శ్రోతలలో కలిగింది? అన్నసంగతి పరిశీలింపదగ్గది.

శ్రీ పేరాల భరతశర్మగారు రసపోషణకి పద్యకాఠిన్య పారశ్యాలు ముఖ్యములు కావన్నారు. విశ్వనాథ అభిమానకవి అన్నారు. విశ్వనాథ తన పద్యంలో పేర్కొన్న కవులంతా అభిమాన పాత్రులని వేరే చెప్ప నక్కరలేదన్నారు. నిరాక్షేపములయిన సంస్కృత సంస్కృతీ పూరితములైన అభిప్రాయాలు వీరివి.

శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులు. కాలాన్నిబట్టీ అభిరుచుల్నిబట్టీ అభిమానం మారుతూ ఉంటుంది అన్నారు. సద్యః అర్థస్ఫూర్తిలేక పోతే కవిత్వం కాదన్నారు మెల్లవలె. దీనిని అంగీకరిస్తే ఆలోచనామృతత్వానికి భంగంకలిగినట్టే కదా. వీరు పఠితల హృదయంలో ముద్రవేసే కవులంతా అభిమాన పాత్రులనడం హృదయంగమం.

కవిత్వం ఏలాఉండాలనే విషయంలో విస్పష్టమైన ఆసక్తిదాయకమైన నూతనోత్సాహకరమైన నిర్వచనమేమీ ఎవరూ చేయలేదు. అలా చేయక పోవడమే మేలనిపించుచున్నది.

మూడు ఆవృత్తుల విషయ వివేచన పట్ల ఎవరూ శ్రద్ధ చూపలేదు. ఒకరిద్దఱూ నియమాతిక్రమణం చేసినందున కార్య నిర్వాహకులు 1,2 ఆవృత్తులు పూర్తియై నట్లు చెప్పడం, మా రెండవ ఆవృత్తిపూర్తి కానందున మూడవ ఆవృ[illegible]కలుపు చున్నామని మరికొందఱు వక్తలు ఉపక్రమించడం, మెత్తదనంవీడి కొంచెం కఱుకుదనం వహించదలచీ అధ్యక్షులు చివరికి మార్దవాన్నే ప్రదర్శించడం ఇత్యాదులు భువనవిజయంకంటె ఉన్నత స్థాయిలో జరుగుతుందను కొన్న కవన విజయ సభకి నిండుదనం కలిగించలేదనవచ్చును. భువనవిజయ సంబంధి సమస్యాపూరణవిధానం కవనవిజయంలో చొప్పించడం దానికి సుప్రసిద్ధకవు లంగీకరించడం అందునా రా రా కృష్ణరాయా అని సంబోధించి స్వాతంత్ర్యంచూపిన మహా కవిని సంభావించే కవివర్యులు; ఎప్పుడు పడితే అప్పుడు కవిత చెప్పడం వీలుకాదని భీష్మించుకొనడాన్ని ప్రశంసించిన కవివరేణ్యులు కూడ అంగీకరించడం వారి మహౌదార్యమే అనుకోక తప్పదు.

అధికమయిన వ్యయ ప్రయాసలకోర్చి ఆంధ్రకేసరి యువజన సమితివారు ఆదర్శప్రాయంగా నిర్వహింపదలచి యీసభను చాలవఱకు తృప్తికరముగా నిర్వహించిరి. నిర్ణీతకాలమున సభాప్రారంభ మగుట గొప్పవిశేషమనక తప్పదు. తరచు ఇట్టి కార్యక్రమములు జరిగినకొలదీ లోపలేశములు తప్పక సవరింపబడ గలవని విశ్వసింపవచ్చును.

# శ్రీ రామస్తవరాజము

— "కవిగణపతి"

శ్రీ కౌసల్యానయనమహా ! వంశీధరా ! విష్ణురూపా !
వైకుంఠా ! సత్వగుణమహితా ! స్వర్ణదీయుక్తపాదా !
సాకారా ! దార్శనికనికరాహ్లాద కృష్ణాజతత్త్వా !
సాకేతాంచన్నిగమనిలయా ! శాంత ! శ్రీరామచంద్రా !
నాదాతీతా ! ప్రకృతిరహితా ! నాగతల్పా ! చిదంశా
దస్తుత్యా ! ప్రణవసహితా ! విశ్వరూపా ! తదాఖ్యా !
వైదేహీహృద్వనజసవితా ! భానుబింబాంతరస్థా !
వేదవ్యాహప్రణుత మహిమా ! వీర ! శ్రీరామచంద్రా !
శ్వేతద్వీపాంతర మణిగృహా ! సేవితార్యా ! రమేశా !
ప్రాతఃకాలార్యమగురుసహా ! రక్తరాజీవనేత్రా !
త్రాతా ! శార్ఙ్గీ ! దశరథసుతా ! తారకబ్రహ్మ ! శౌరీ !
గీతావక్తా ! సకలశుభదా ! కృష్ణ ! శ్రీరామచంద్రా !
మోహోన్మూలా ! ప్రమదసదనా ! ముంజకేశా ! అనంతా !
స...స్రారాంబుజనిరతవాసా ! సుధర్మస్వపీఠా !
...వాస్థ ... పతగతురగా ! పుష్పకారూఢ ! నిత్యా !
శ్రీహేమాహార్య శిఖరచరల్లేఖ ! శ్రీరామచంద్రా !
ఆజానూద్దండభుజ ! సుమదామ్యప్రదీప్తోరుఫాలా !
రాజద్గ్రైవేయ ! మణిముకుటా ! రమ్యకేయూరహస్తా !
భ్రాజత్తాటంకధర ! మధురశ్రావ్యవాక్శోభితాస్యా !
తేజోరాజా ! కుశలవపితా ! దేవ ! శ్రీరామచంద్రా !
శృంగారాబ్ధీ ! సహృదయ ! కవీ ! శ్రీవిరాడ్రూప ! తత్త్వ
చ్ఛృంగా ! బృందావనవిహరణా ! నృత్తగీత ప్రమోదా !
రంగన్నాసాఘటితకువలా ! రాగపూర్ణా ! తమోఘ్నా !
సంగోత్సాహా ! వరద ! ఋతవిశ్రాంతి ! శ్రీరామచంద్రా !
తర్కాతీతా ! సకలభువనాధార ! చిత్తావళీసం
పర్కఖ్యాతా ! సదయ ! సులభా ! ప్రావృడంభోధరాభా !
ఆర్యాబ్జాతాంబక ! సురుచిరా ! ఆంజనేయాత్మభూపా !
ఆర్కాభిఖ్యాన్వయజ ! సుభగా ! హంస ! శ్రీరామచంద్రా !
ప్రత్యగ్జ్యోతీ ! అమృతమయ ! నీవారశూకోపమా ! సం
స్తుత్యాద్వైతానుభవ ! సవసంతుష్ట ! తన్మంత్రసారా !
సత్యజ్ఞానాత్మక ! పరమ ! సుశ్యామలా ! కోమలాంగా !
ప్రత్యక్షాకారధర ! నుతగీర్వాణ ! శ్రీరామచంద్రా !
మారీచారీ ! దశముఖహరా ! మత్స్యకూర్మాదిరూపా !
శ్రీరేశోన్మంథన ! వరగుణాదర్శ ! వీరాసనస్థా !
సారాచార స్తిమితముని హృత్సారసాంతఃప్రవిష్టా !
పారావారప్రణుతవిభవా ! భావ్య ! శ్రీరామచంద్రా !
శ్రీవాల్మీకి ప్రకటితకథాసింధుసంజాతచంద్రా !
దేవవ్రాతద్విషదసుర నిస్తేజతుండాబ్జ చంద్రా !
భావాంచద్భక్తజనశుచిమద్వక్త్ర కల్హారచంద్రా !
గ్రావాహల్యామృతదసుపదా ! శాంత ! శ్రీరామచంద్రా !

* ఇందు శ్రీరామచంద్రా అను మకుటమునువిడిచి విశేషణములను లెక్కించినచో సరిగా 108 సంఖ్యలో కలవు. కావున ఇది అష్టోత్తరశత విశేషణాయతము.

# కాలావర్తము

— తంగుడిగె శ్రీధరరావు, బి. ఎ., బి. ఒ. ఎల్.

మాతా ! నీకృపనోచని
మందభాగ్యుడే నైతిని
చీకటింట వెలుతురుకై
చీకునగుచు వెదకుచుంటి.
నే దెలియని నడకలలో
నీరైపారెను కాలము
కాలావర్తములోపడి
కడతెరుగని మీనమైతి.
అజ్ఞానపుటాంధ్యమ్మున
అల్లాడెడు నాచిత్తము
నాకు నీకు నడుమ వికట
నాట్యమ్మొనరించుచుండె.
అడ్డుగోడ తొలగిపోవ
యత్నించెడు నాయత్నము
ఫలియించుటొ లేకుండుటొ
భారమంత నీదే యగు.
అపుడప్పుడు నేగోరెడు
అల్పమైన విషయమ్ముల
ద్రోసిపుచ్చి నన్నిలని
గ్రుడ్డిగ జేయుందువు సతము.
దూరముగా జనువారిని
చేరువగా చేర్చుచు సం
సారులకై దివ్యత్వపు
సారమ్మును గూర్చెదవు.
దిశవచ్చెడు నీకిరణము
ప్రగతికి సంకేతమగును
పతితుల నభ్యుద్ధరించు
ప్రజ్ఞానపు దీపమగును.
నీకొసగిన చాలునావ
నీప్రేమను చిలికింతువు
నిన్నడిగిన చాలు నన్ను
నీవే నడపించుకొందు.
కనుదమ్ములు మూయకున్న
కనుపెట్టో నీ తేజము !
అనిమిషునిగ నను జేయవ
కనుమూసెడు స్థితి నీయవ !
ఆత్మాంత శ్చైతన్య
మ్మంతకంత కెగబ్రాకగ
విశ్వాంతర గంభీర
ప్రేమాబ్ధిని చేదోగద.

**Regd. No. H/Rmy-42.** **Samalochana 16,October 1978.**

## బి. వి. అండ్ కో., పుస్తకములు

బి. ఏ., బి. యస్ సి., బి. కాం. తరగతుల I, II సంవత్సరముల తెలుగునోట్సు (ఆంధ్రా యూనివర్సిటీ) అన్నియు ముద్రింపఁబడి ప్రతులు సిద్ధముగా నున్నవి. కొన్నిరకముల ప్రతులు చాల తక్కువగా నున్నవి. త్వరపడుట మంచిది.

ఇంటరు I, II సంవత్సరముల తెలుగు, ఇంగ్లీషునోట్సు; X తెలుగు, ఇంగ్లీషు, హిందీ నోట్సు అన్నియు సిద్ధముగా నున్నవి. ఇంటరు తెలుగు ప్రోజు నోట్సు ప్రతులు అయిపోయినవి. 10 రోజులలో అనగా అక్టోబరు 25, 26 తేదీల నాటికి పునర్ముద్రణము పూర్తిచేయబడును.

**బి. వి. అండ్ కో.,**

**6 - 8 - 7, ఇన్నిసుపేట**

రాజమండ్రి-1.

## రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ ప్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనమువట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన అతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు వీలైనంతవఱకు ప్రయత్నింపఁ బ్రార్థన.

నవంబరు 1 వ తేదీని వార్షిక సంచిక ప్రచురింపదలచితిమి. వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక. సంపాదకుడు.

అడ్రసు :—

[illegible]

**Retired Telugu Lecturer, V. T. J. College,**
6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.

## చందాదారులకు

ఈ అక్టోబరు 16 తేదీ సంచికతో సంవత్సరము పూర్తియగుచున్నది. సంవత్సరము పూర్తియైన చందాదారులు రెండవసంవత్సరము చందా రు 10-00లు 1-11-78 తేదీలోపున ఎం.ఒ. ద్వారా పంపగోరిక. లేనిచో వార్షిక సంచిక 1-11-78 న వెలువడేది నిలుపుచేయవలసివచ్చును. సాహిత్యాభిమానులెల్లరు నూతన-చందాదారులుగాచేరి మా సాహిత్య వ్యాసంగమునకు ప్రోత్సాహ మీయగోరిక.

— సంపాదకుడు 'సమాలోచన'

**Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.**